# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 – 1972]

శుక్రవారం : 30–4–'82

దుందుభినామ సం. వైశాఖ శు. సప్తమి

సంపుటము 75 : సంచిక 34

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67–60

ఆరు మాసాల చందా రు. 33–80

విడి ప్రతి వెల రు. 1–25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


---

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి మధుమల్హోత్రా

(ఫోటో : [illegible])


**కథలు :**

మధ్యతరగతి మందహాసం ... 6

గురుసాక్షాత్‌పరబ్రహ్మ:? ... 24

ఇది కథ కాదు ... 47

గతుకులబాట ... 52

కంచే చేనుమేస్తే ... 59

**సీరియల్ నవలలు :**

మనసు కథ ... 20

తార ... 42

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు—4, లోకంపోకడ – 5, ప్రశ్నావళి—15, ఫాలాక్షుని డైరీ—16, ఊహాలఉయ్యాల [రంగులబొమ్మలకథ] 31, సినిమా—32, విద్యార్థిలోకం వ్యాసరచన పోటీ—34, బొమ్మలమహాభారతం—50, హైదరాబాద్ నోట్‌బుక్—51, ధర్మపథం – 58, వారఫలం—64, వంటలు—65.


## లోకం పోకడ * ఊమెన్


















ఎక్విటెన్స్‌లో సంతకం చేస్తుంటే చేతులు వణికాయి. అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లాయి. గుండె బరువెక్కింది. జీతం అందుకుంటూ వుంటే పెన్నిధి నుంచి చివర చివర అందుకున్నట్లుగా వుంది.

'ఇంకో నెల అంతే!' పేలవంగా వెలిసింది చిరునవ్వు.

హెడ్మాష్టరుగారు నవ్వేరు. 'మీరు అక్టోబరులో పుట్టి వుంటే ఈ సంవత్సరమంతా పనిచేసి జూన్‌లో రిటైరయ్యేవారు!' అన్నారు.

గడ్డిపోచ కదలాడినట్టుగా నవ్వేడు సీతారామయ్య. "ముఖ్యమంత్రిగారే దయతలచి వుండకపోయి వుంటే మూడేళ్లనాడే రిటైర్ అయ్యేవాడిని కదా! ఎక్కడి కెంత ప్రాప్తమో అంతే! ఆశపడితే వస్తుందా!"

హెడ్మాష్టరుగారింకేమీ అనలేదు. కానీ స్టాఫ్ మాత్రం సీతారామయ్యగారి వంటి ఉత్తమ ఉపాధ్యాయుడు, శిష్య వాత్సల్యం కలవాడూ, ఆదర్శజీవి రిటైర్ కాబోతున్నందుకు వింతగానో విచారాన్ని వ్యక్త

పరిచారు. సెప్టెంబరంతా పనిచేసి ఆఖర్లో రిటైరు కాబోతున్నాడు ఆయన.

జీతం తీసుకుని మెల్లగా యింటి ముఖం పట్టారు సీతారామయ్యగారు. ఆయన మనస్సులో ఆలోచనలు శ్రావణ మేఘాల్లా కమ్ముకుంటున్నాయి. భయాలు పోట్లగిత్తల్లా కుమ్ముకుంటున్నాయి.

ఇంటికి రాగానే పెద్ద కోడలికి జీతం అందించాడాయన.

'ఇంకో నెల...' అంతేనా అన్నట్టుగా చూసింది సీత.

దాదాపు నలభయి సంవత్సరాలుగా నెల నెలా జీతం యిస్తూ యిలాంటి చూపుల్ని ఎన్నో ఎదుర్కొన్నాడు ఆయన. తొలి తొలి నాళ్లలో ఎంతో గర్వం, ఎంతెంతో ఆనందం. ఫస్టు వీక్‌లో జీతం యిచ్చే రోజున గొప్ప తృప్తి.

పెళ్ళయింది...తొలిసారిభార్య చేతికి జీతం యిచ్చిన రోజు యిప్పటికి గుర్తే... ఆమె ముఖంలో విదియనాటి చంద్రరేఖ లాటి చిరునవ్వు యీనాటికీ తను మాసిపోయినా మాసిపోని వెలుగు రేఖ.

పిల్లలు ఒక్కొక్కరే పుట్టుకొచ్చే కొద్దీ, పెరిగిన సంసారంతో పాటుగా పెరుగుతూ వచ్చిన ఖర్చులు... చిక్కులు...యిబ్బందులు వాటితో సమానంగా పెరగలేని జీతం గురించి జీవితంలో నిత్య సంగ్రామం...ఆలోచనలు... ఆరాటాలు.

ఏళ్ళు గడిచేకొద్దీ పిల్లలకి వయస్సు పెరిగి అవసరాలు పెరిగి, వాటితోపాటు పెరగని ఆదాయంతో పోరాటం వల్ల పెరిగిపోయిన దిగుళ్ళు... మనస్సులో ఎప్పుడూ ఆర్థిక సంబంధమయిన ఏగుడు దిగుళ్ళు.

భార్య అనారోగ్యం...ఏటేటా కాన్పులతో తరిగిన శ రీ ర ం తో పాటుగా అటుగా పెరుగుతూవస్తోన్న అనారోగ్యం...వైద్యానికి చిక్కులు... డాక్టర్లకి, మందులకి అందించ గలిగినంత చాలనంత జీతం... ఆఖరికి భార్యని- తన ప్రాణంలో ప్రాణాన్ని- తన శరీరంలోని జీవాన్ని- తన జీ వి తా న్ని వెలిగించిన దీపాన్ని, తన కంటి వెలుగుని- యింటి దీపాన్ని- తన కలల చెలిని- ఆ అనారోగ్యానికే బలి చేశాడు...

'పెన్షన్ రావాలంటే చాలా కాలం పడుతుందేమో?'

నిట్టూర్చాడు సీతారామయ్య. తలూపేదు సమాధానంగా. పెద్ద కోడలు అదోలా చూసి వెళ్ళిపోయింది.

తన రిటయిర్‌మెంట్, తన పెన్షన్, తన పి. ఎఫ్. ఈ విషయాలు తలుచుకోవటం యిష్టంలేదు ఆయనకి కొన్ని కొన్ని విషయాలను తలుచుకోవటం, తలచుకోకుండా వుండటమే మంచిది. అందువల్ల సుఖం లేకపోగా మనస్సుకి బాధ.

'టీ!' అందించింది రెండో కోడలు అరవింద. అలవాటుగా తాగేశాడుకే ఆయన. 'ఇది మానేస్తే పంచదార, పాలు, టీ ఖర్చు సగానికి సగం తగ్గుతాయి. ధరలు పెరిగితే మధ్య తరగతి మనిషి చేసే నిర్బంధ పొదుపు. ఆదాయం తగ్గితే సామాన్యుడు చేయవలసిన విధిలేని పొదుపు. అంతే!' అనుకున్నాడు.

అంతలో మూడవ కోడలు అరుణ చేతి సంచులు తెచ్చి యిచ్చింది. పెద్ద కోడలు సీత డబ్బు, సరుకులపట్టీ అందిస్తే జేబులో వేసుకున్నారు. ఇన్నేళ్ళుగా ఆయనే యింటికి సరుకులు తెస్తారు. సీత పట్టీ రాస్తుంది. ఇద్దరూ కలిసి నెల నెలా బడ్జెట్ తయారు చేసుకుంటారు.

ఈసారి మాత్రం బడ్జెట్ తనే తయారు చేసింది. మామగారిని సంప్రదించలేదు. వచ్చే ఒకటవ తేదీ నుంచి తగ్గబోయే ఆదాకి తగ్గట్టుగా బడ్జెట్‌లో కోత యిప్పటి నుంచే ప్రారంభించింది ఆమె. కొట్టుకు వెళ్లేక మామగారే చూసుకుంటారులే, అన్నట్టుగా వెళ్ళిపోయిందామె పుస్తకం అందించాక.

సచారీ కొట్టుకు బయలుదేరాడు సీతారామయ్య.

ఆయనకి ఆరుగురుకొడుకులు. ఆరుగురు కూతుళ్ళు. పెద్ద సంసారం. ఉన్నకి, సన్నకి అన్నకోసం వెళ్ళకుండా, రిబ్బన్లనీ, సబ్బులనీ, పౌడర్లనీ డబ్బు వ్యర్థం చేయకుండా, చీరలనీ, సారెలనీ, సినిమాలకనీ, షికార్లనీ, వేధించకుండా గుంభనగా లాక్కొచ్చింది సంసారాన్ని. శారదని అందుకు మెచ్చుకోవాలి. అభినందించాలి. ఆమె తర్వాత యిప్పుడు కోడలు సీత.

కూతుళ్ళందరికీ గంతకు తగ్గ బొంత అన్నట్టుగా తగిన సంబంధాలే చేశాడు. కట్నాలు అడక్కుండా కన్యాధనమే ధనం అనుకునే యోగ్యులని వెతికి వాళ్ళకిచ్చి చేశాడు అన్ని పెళ్ళిళ్ళూ!

కొడుకులకి అందరికీ యథాశక్తి చదువు చెప్పించాడు. పెద్దవాడు నారాయణ బి. ఏ. కాటన్ మిల్స్‌లో ఉద్యోగం. రెండోవాడు ఎం. ఏ. చేశాడు. అయినా లెక్చరర్ ఉద్యోగం రాలేదు. స్థానికంగా వుండిపోవాలని ఫాక్టరీలో చేరాడు. మూడోవాడు బి. కాం. ఒక రైసు మిల్లులో మేనేజర్. నాలుగోవాడు బి. ఏ., బి. ఇడి. అయినా ఉద్యోగాల తిమింగలం వేటలో చిక్కుకుని ప్రయివేట్ స్కూల్లో పనిచేస్తున్నాడు రెండొందలకి. ఆఖరి యిద్దరూ కవలలు. ప్రయివేట్‌గా ఎం. ఏ. చేసుకుంటూ అక్కడా ఇక్కడా ప్రయివేట్ కంపెనీల్లో ఉద్యోగాలు వెలగబెడుతోన్నారు.

ఎవరికేం కొరత లేదా? అంటే లేదు. వుందా? అంటే వున్నాయి. ఎక్కడికక్కడ తృప్తి. గుమాస్తాగా వుద్యోగంలో చేరితే ఆఫీసరు పోస్టుమీదే వుంటుంది కన్ను. అన్నిటా అంతే.

మెల్లగా నడుస్తూన్నారు ఆయన.

ఆలోచనలు వెంటాడుతూనే ఉన్నాయి.

కొడుకులకి ప్రభుత్వ ఉద్యోగాలు రాలేదని అసంతృప్తి, కోడళ్ళకు నగలు చీరలు లేవని అసంతృప్తి. ఉమ్మడిగా కాకుండా ఎవరికుండలో వాళ్ళు ఉడకేసుకోవటం లేదని వాళ్ళలో బయటకురాని గొప్ప అసంతృప్తి.

తనేం చేయగలడు?

మంచం ఉన్నంతవరకే కాళ్ళు చాపుకునే మనస్తత్వం తనది. కొడుకులు కలెక్టర్లనీ,

## టెలిఫోన్లో కవితలు !

పశ్చిమ జర్మనీలో టెలిఫోన్లు కూడా సాహిత్య సేవ చేస్తున్నాయి. టెలిఫోను నంబరు త్రిప్పితే, టెలిఫోనులో ఐదు నిముషాల పాటు ప్రముఖులు రచించిన కవితలు, కథలు, వినవచ్చు. ఈ కవితలు లేక కథలను రచయితలు స్వయంగా చదవగా రికార్డు చేయడం మరో ప్రత్యేకత. అందువలన కవితనే కాక రచయిత గొంతును కూడా వినే అవకాశం సాహిత్యాభిమానులకు లభిస్తుంది. రచయితను గురించి, వారి రచనలను గురించి సంపూర్ణ వివరాలను స్థానిక ఆర్ట్స్ డిపార్టుమెంటు నుండి పొంద వచ్చును.

# మధ్యతరగతి మందహాసం

డాక్టర్లనీ, ఎడ్వొకేట్లనీ, ఇంజనీర్లనీ, లెక్చరర్లనీ, ఆఫీసర్లనీ తను కలలుకనలేదు ఏనాడూ! కానీ వాళ్ళు బాగుండాలని ఆశించాడు అంతే!

"తనది మధ్యతరగతి మందహాసం!"

దీనికి కాంతి లేదు తళుకు లేదు పేరుకి మాత్రం చిరునవ్వు! జీవం, వెలుగులు లేని నవ్వు

'నమస్కారం మాస్టారూ!'

ఆలోచనలు తెగాయి, స్విచ్ నొక్కగానే చీకట్లు పారిపోయినట్లు.

ఎదురుగా విశ్వం!

ఒకప్పటి తన విద్యార్థి. తన మిత్రుడు రాము కుమారుడు. ఉద్యోగాల రీత్యా ఊళ్ళు పట్టి పోయాడు. ఏమిటీ జీవితాలు! స్నేహాలకి కూడా బంధాలుంటాయా? అవి సడలిపోతాయా? కాలం, దూరం పరిస్థితులు స్నేహం పై కూడా ప్రభావాన్ని చూపుతాయా! స్నేహం వాటికి అతీతం కాదా!

విశ్వాన్ని చూడగానే ఆయన గుండెలో జాలి కదిలాడింది. "విశ్వం! రాము పోయాడట కదా! ఏమైంది! జబ్బుగా ఉండిందా! నాకు చాలా రోజులకి తెలిసింది. వద్దామనుకుంటే తీరనే లేదు. ఎక్కడ చెప్పు. అన్నీ యిక్కట్లే ...అమ్మగారు ఎలావున్నారు!" అన్నపూర్ణకి రాము అంటే పంచప్రాణాలు! భర్తని అంతగా ప్రేమించే వాళ్ళు యీ రోజుల్లో ఎక్కడున్నారు?

విశ్వం ముఖంలో విషాదం కమ్ముకుంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మేఘం చల్లగాలికి కరిగిపోయినట్టుగా మనస్సు ప్రేమకి, ఆత్మీయతకి ద్రవిస్తుంది.

"నాన్నగారు పోయి నెల తిరక్కముందే అమ్మ కూడా వెళ్ళిపోయింది. ఆయన హార్ట్ఎటాక్‌తో పోయారు. ఆఫీసు నుండి వచ్చి రీడింగ్ రూంకివెళ్ళి పేపర్ చదువుతూ చదువుతూ పడిపోయారు. హాస్పిటల్ కి రీడింగ్‌రూం సెక్రటరీయే కార్లో తీసికెళ్ళాడు. హాస్పిటల్‌కి వెళ్ళకముందే ప్రాణం పోయింది. అమ్మగారూ అంతే! పడుకున్నది పడుకున్నట్టుగా వెళ్ళిపోయింది!"

'అయ్యో పాపం! ఎంత ఘోరం జరిగింది' సీతారామయ్య నోటమాట పెగల్లేదు. ఆయన గుండెల్లో దేవినట్లయ్యింది. ఒక యింట్లో నెల తిరగకుండానే తల్లిదండ్రులు పోతే ఆ

సంసారం గతేమిటి కావాలి? పిల్లలు పెద్దవాళ్లే అయి వుండవచ్చు. అయితేనేం! ప్రపంచంలో నెగ్గుకరావటం వింత కష్టం! అందునా సానుభూతి, స్నేహం, అభిమానం, దయ క్రమంగా క్షీణించే యీ రోజుల్లో.

మాస్టారు గారి వెంట నడుస్తూ వచ్చాడు విశ్వం.

'ఎలా చేస్తున్నారు మరి!' మధ్యతరగతి జీవనాడి తెలిసిన సీతారామయ్య అడిగాడు. విశ్వం వాళ్ళ ముగ్గురన్నదమ్ములు ముగ్గురూ బి. ఏ చదువుకున్నారు ఒకడు ఈ మధ్యే ఎమ్మే కూడా చేశాడు, అయినా ఉద్యోగాలు ఎక్కడున్నాయి!

"నాన్నగారు పోయాక మా రెండో తమ్ముడు శివరాంకి అదే డిపార్ట్‌మెంట్‌లో ఎల్‌డీసీగా ఉద్యోగం యిచ్చారు వాడికి ఏజ్ బార్ కాలేదు కదా! పెద్దవాడు శ్రీనివాస్ ఫ్యాన్సీకొట్టు పెట్టాడు నాన్నగారి చావుతో పదివేలు వచ్చాయి. జీతం డబ్బులూ వచ్చాయి కదా! నేను అదే కంపెనీలో పని చేస్తున్నా నింకా! ఏదో బొటా బొటి జీతం! ఎక్కడికి మాస్టారూ! జీవితం సాగనివ్వాలి అంతే!'

'విశ్వం కూడా ఫిలాసఫీ మాటాడు తున్నాడు' అనుకున్నాడాయన. 'ఎందుకు మాటాడడు? జీవితం ఒక పెద్ద పాఠశాల. ఊహూ విశ్వవిద్యాలయం. దాన్నో నేర్చుకోని పాఠం ఏముంది? అన్నీ అదే నేర్పుతుంది... అయితే ఒక రకంగా రామారావు చావుతో ఆ కుటుంబ ఆర్థిక పరిస్థితులు ఒక కొలిక్కి వచ్చాయన్నమాట! పోనీ, అదీ ఒకందుకే కలిసొచ్చింది...హూఁ ఏం జీవితాలు ... చావు పుట్టుకలతో కూడా లాభనష్టాలు వేసుకుంటున్నాం!"

"వస్తాను మాస్టారూ! బజార్లో పని చూసుకుని మళ్ళీ యింటికి వస్తాను."

తలూపేడు సీతారామయ్య.

ఆయన ఆలోచనలు యింకా విశ్వం చుట్టూ తిరుగుతున్నాయి. ఆలోచనలు ఒక కేంద్రం చుట్టూ తిరగడం ప్రారంభిస్తే ఒక పట్టాన వదలి రావు కాబోలు- చెదిరితే తప్ప...

తనకి ఆయిదేళ్లనాడు హార్ట్ ఎటాక్ వచ్చింది. ఇన్నేళ్ల జీవితంలోనూ తను అనుభవించనది అనారోగ్యం ఒక్కటే! రక రకాల సుఖాలు అనుభవించ లేదు తను. అయినా రక రకాల బాధలు అనుభవించాడు. అన్నిటా కంటే లేమి, భార్యా వియోగం; అదే తనకి అప్పుడు గుండెపోటుని తెచ్చిపెట్టింది. తన కొక్కటే తృప్తి, తనది పరిపూర్ణమయిన ఆరోగ్యం...

భార్యవెంటే తనూపోయివుంటే ... తన కొడుక్కి ఉద్యోగం వచ్చేది. తన కుటుంబానికి ఓ యిరవై ముప్పై వేలు డబ్బు అందేది. ఇన్సూరెన్సూ వచ్చేది...ప్చ్ ... ఏం బ్రతుకు యిది ...

తను యీ అయిదేళ్ళ బ్రతుకుని పొడిగించుకుని సాధించేదేం వుంది! మరిన్ని బాధలని చూశాడు. ప్రభుత్వం పుణ్యమా అంటూ యీ మూడేళ్ళూ ఉద్యోగం చేశాడు. మరికొంత జీవితాన్ని చూశాడు. అంతే కదా!

పచారికొట్టు జేరగానే ఆలోచనలు ఆగిపోయాయి.

జనార్దన్‌కి డబ్బు యిచ్చాడు బిల్లు వెయ్యటానికి. పుస్తకమూ అందించాడు. అందులో పరుకుల పట్టీ వుంది.

'కూర్చోండి. టీ తాగుతారా!' నవ్వుతూ పలకరించాడు. అతను తన ఫ్రెండ్ రంగ నాయకులకి పరిచయం. అతను కొట్టు పెట్టి నప్పటి నుంచీ తను అక్కడే కొంటున్నాడు. ఇరుకూ యిబ్బందులకి ఆదుకుంటాడని తనకి అతనిపై అభిమానం...కానీ అతనకి విశ్వాసం వుంటుందా! తను అందర్లాటి కష్టమర్. అంతేనేమో!

కొట్లో రద్దీ లేదు. పట్టీ గుమాస్తా చేతికి అందించి ఫ్యాన్ వేసుకుని కబుర్లు మొదలు పెట్టాడు ... ఫాన్ తిరుగుతోన్నా గాలి ఆట్టంలేదు సీతారామయ్యకి.

'ఈ నెలాఖరుకి రిటైర్ అవుతున్నానోయ్!' తన రిటైర్‌మెంట్ విషయం చెప్పాడు మాటల మధ్యలో సీతారామయ్య.

ఆ మాట వినగానే అతని ముఖంలో మార్పు వచ్చింది. కబుర్లు ఆగేయి. అంతలో పరుకులు కట్టటం పూర్తయింది. పాకెట్స్ అన్నీ సంచుల్లో సర్దేడు.

పట్టీ చూశాడు జనార్దన్. 'అబ్బో! ఇంకా రెండొందల పాతిక మిగిలిందే! కొంచెం మొత్తం తగ్గించండి సార్! ఒక్కోపద్దు మీద యిలా వందలొందలు వుంచెయ్యాలంటే మాకూ యిబ్బందే! పైగా సేల్స్‌టాక్స్, యిన్‌కమ్‌టాక్స్ లెక్కలు. ఆదాయం తక్కువైనా ఆ బాధలు మాత్రం తప్పవు. మేమేదో లోకాన్ని దోచుకుని తినిపోతున్నామని అందరికీ కుళ్ళు. ఎవరి బాధలు వాళ్ళవి. శ్రీ శ్రీ అన్నట్లు పీత బాధలు పీతవి ... మీరు రిటైర్ అయితే చాలా యిబ్బందే! పెద్ద సంసారం! ఎలా లాక్కొస్తారో ... పాపం...'

సీతారామయ్య సమాధానం యివ్వలేదు. ఆయనకీ సానుభూతి వాక్యాలు కొత్త కాదు. ఇది దేనికీ 'ఇంట్రు'నో బాగా తెలుసు. అనుభవాలతో పండి పోయింది వయస్సు.

'ఏమోసార్! నేనూ యిక మెలి మెల్లిగా పద్దులు తగ్గించుకోవాలను కుంటున్నాను. ఎక్కడ సార్! ఒకోసారి బాకి పడితే అది



# మధ్యతరగతి మందహాసం

విన్నేళ్ళయినా తీరదు. గట్టిగా అడిగితే విష్కారం. పోట్లాట. డబ్బు యిచ్చి చెడ్డ య్యేవాడు ఒక వర్తకుడే సార్ లోకంలో."

సీతారామయ్య నవ్వేడు "జనార్దన్ ఆదాయం తగ్గితే అవసరాలూ తగ్గవు. అయినా తగ్గించుకోవాలి తప్పదు. అందని మాని కొమ్మలకి అర్రులు చాచకూడదు."

సరుకులు రిక్షాలో వేసుకుని బయల్దేరాడు ఆయన.

ఆయన మనస్సులో యింకా అతనిచ్చిన అల్టిమేటమ్ మెదలుతూనే వుంది. తప్పదు. ఇలాటి షాకులకి తట్టుకోవాలి. విన్నెన్ని అనుభవాలు చవిచూశాడు తను, వాటిలో ఇదీ ఒకటి. మరణానికి మార్గం లేదు కానీ మహావిషానికీ విరుగుడు వుంది.

దీనికో పరిష్కారం చూడాలి. అంతే!

రిక్షా యింటి ముందు ఆగేదాకా రక రకాలు ఆలోచనలు! తెగిన గాలిపటం సుడిగాలిలో చిక్కుకున్నట్టుగా బాధల వడిలో పడ్డ మనస్సుకి ఒక గమ్యం వుండదు. పదిపరివిధాలా పరిగెడుతూ వుంటుంది.

సరుకులతో యింట్లోకి వెళ్లేసరికి కొడుకులందరూ వచ్చారు. జీతాలందిన వాళ్ళంతా తను తమ జీతాలు పెద్దకోడలు సీతకి యిచ్చారేమో! ఆమె 'బడ్జెట్' తయారు చేస్తోంది. ప్రభుత్వం యేడాదికి ఒకసారి బడ్జెట్ తయారుచేస్తే 'ప్లానింగ్' తెలిసిన మధ్యతరగతి కుటుంబాలు నెల నెలా బడ్జెట్ తయారు చేసుకోవాలి. జీతాలు నెల నెలా సరిగా వస్తాయే కానీ నెల నెలా పెంగవు. అది గొర్రెకు తోక బెత్తెడు అన్నట్టుగానే వుంటాయి. ఇంక్రిమెంటు పేరుతో ఏడాదికి పదో పదిహేనో పెరిగితే దానికంటే ముందు గానే ఇంటి అద్దె పెరిగి వుంటుంది. ప్రభుత్వం జీతాలు పెంచితే అవి పేపర్లో ప్రకటించక ముందే నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశంవైపు పరిగెడుతూ వుంటాయి. అందుకే నెల నెలా అవసరాల్లో 'కోత' విధించుకోవలసి వుంటుంది.

'వచ్చే నెల నుంచీ మామగారి జీతం రాదు! వెయ్యి రూపాయలు బడ్జెట్ కుదించాలి. జీతం విచిమిదొందలు తగ్గితే ఖర్చులు వెయ్యి తగ్గాలి.'

'ఖర్చులు తగ్గుతాయా ?'

'విలాగో సర్దుకోవాలి!'

'విలా సర్దుకోవటం? ఏం సర్దుకోవటం ?'

'నా దుంప తెగుతోంది ఈ సంసారాన్ని లాక్కుని రాలేక. ఆరు సబ్బుల్ని మూడే చేస్తాను. చక్కెర తగ్గించేస్తాను కోటా. అందరికీ కాఫీ రెండో కోటా తగ్గిస్తాను. మామగారికి ఒక్కరికే సాయంకాలం టీ యిస్తాను. వారానికి ఒక సినిమా కాదు. నెలకి ఒక సినిమా! అంతే! సినిమాల కేమిటి! ఆరు థియేటర్లున్నాయి వారాని కొకటి కొత్తది – మంచిది వస్తోంది. విక్కడికి ఆశ. చూస్తూ వుంటే అన్నీ బాగానే వుంటాయి. నూనె అయిదు కేజీల మంచి మూడు కేజీలకి తగ్గిస్తాను. ధర మండిపోతోంది' సీత ఆర్థిక మంత్రిణిగా అన్నిటికీ కోత విధిస్తోంది.

ఉస్సురని నిట్టూర్చాడు సీతారామయ్య 'నిర్బంధ పొదుపు' అనుకున్నాడు.

కొడుకులుఅంతా మౌనంగా వింటున్నారు. సీత ప్రత్యక్షంగా విపరితోనూ అనకపోయినా అందరికీ తెలుస్తోంది. కొడుకుల ముభావం చూస్తే ఆయనకి తండ్రి శవం చుట్టూ చేరి మౌనం పాటిస్తోన్నట్టుగా అనిపించింది.

డబ్బు! డబ్బు!! డబ్బు!!!

దీని కెంత విలువ వుంది ?

ఈ కాయితాలకి యింత పవర్ విక్కడిది?

ఈ నాటి తనకీ, రేపు రిటైర్ అయ్యేక వుండే తనకీ శారీరకంగా, మానసికంగా ఏం మార్పు వుంటుంది! అప్పుడూ విప్పుడూ తను సీతారామయ్యే. కాకుంటే యిప్పుడు విసిస్టెంట్ హెడ్మాస్టర్...రేపు మామూలు నలుగురిలో ఒకడు ...

అంతేనా ?

ఊహూఁ తను గడమడిగే మనిషి! వడుపీనుగుతో సమానం! తను నవ్వులపాలై బ్రతకగలడా! మనిషికి 'రిటైర్ మెంట్' తోనే చావు వస్తే వింత బావుంటుంది.

తన ఆలోచనకి తనే నవ్వుకున్నాడు. 'పిచ్చి!'

'అవును. ఇండియాలో సగటు ఆయుర్దాయం నలభయ్యయిదో ఆరో! తర్వాత జరిగేదంతా-ఆ బ్రతుకంతా బ్రాటోవరే! విందుకీ లాక్కొళ్ళే జీవితాలు, బరువైన

బతుకులు అందరికీ బరువే ... ఆఖరికి ఆ మనిషికి కూడా...'

'నమస్కారం సార్ !'

బిల బిలా వచ్చేశారు పది మంది. అందరూ ఉద్యోగాలు, వ్యాపారాలూ, రాజకీయాలూ చేసుకుంటున్న వాళ్ళు. అందరూ చాపల పై కూర్చున్నారు, కూర్చోటానికి కుర్చీలేవీ? ఇల్లా యిరుకే, వసతీ తక్కువే...

అతిధులు రావటంతో కొడుకులు, కోడళ్ళు, మనవలు మనమరాళ్ళు 'లాస్ట్ బెల్' విన్న పిల్లల్లాగా లోపలికి వెళ్ళిపోయారు.

'మా యింట్లో కుర్చీలు లేవు. పేదవాడిని ... యింటికి వస్తే కాఫీ కూడా యివ్వుకోలేని వాడిని ...'

'నో...నో... అలా అనకండి. అద్దె యిళ్ళల్లో యింత కంటే సౌకర్యాలు వీలా వస్తాయి. ఇపుడు మాకేం కొరవ. హాయిగా చాపలపై కూర్చున్నాం'

అవును. అద్దె కొంపలో, యింతకంటే సౌకర్యాలు ఎక్కడొస్తాయి! శరీరమే ఒక అద్దె కొంప. జీవుడు దొరికిన 'కొంప'తో తృప్తి పడటం లేదే! జీవుడికి లేని తృప్తి మనిషి కెక్కడిది!

'మాస్టారూ !'

'చెప్పండి బాబూ !'

'టీచర్స్ డే సందర్భంగా మీకు సన్మానం ఏర్పాటు చేస్తున్నాం. మీ వంటి ఉత్తమ ఉపాధ్యాయుడికి రాష్ట్రపతి అవార్డో, పద్మశ్రీయో రావలసింది. ప్చ్! మేము పూర్వ విద్యార్థి సంఘం, నగర యువజన సంఘం, ఉపాధ్యాయ సమితి, పౌర సమితి,

## మధ్యతరగతి మందహాసం

పట్టణ ప్రజాభ్యుదయ సంఘం, రోటరీ క్లబ్, జేసీస్, లయన్స్ అంతా కలసి మీకు సన్మానం చేయాలనుకున్నాం, మీరు అంగీకరిస్తే—'

సీతారామయ్య ముఖంలో కాంతి వెల్లి విరిసింది. తొలిసారి తృప్తి ముఖంలో తాండవ మాడింది. పెళ్ళై భార్య యింటికి వచ్చిన రోజు, మొదటిసారి ఎటెండెన్స్ రిజిస్టర్‌లో సంతకం చేస్తున్నప్పుడు, తొలిసారి భార్య కడుపు పండి కొడుకు పుట్టినపుడు కలిగినంత ఆనందం కలిగింది.

వారి ఆత్మీయతని - అభిమానాన్ని కాదనలేక పోయాడు.

'అలాగే బాబూ ! మీరంతా యింతగా అభిమానిస్తూ వుంటే ఎలా కాదనగలను !'

వాళ్ళు సంతోషించారు.

'వెళతాం సార్ !' అని సెలవు తీసుకున్నారు.

సీతారామయ్యకి జీవితం విరత చితమైంది? అనిపించింది. గంట క్రితం ఆలోచనలు! ఆరాటాలు! ఆవేదన! ఇప్పుడు ఆనందం ...

* * *

టౌన్ హాల్లో ఏర్పాటు చేశారు సన్మానం.

సీతారామయ్య రిక్షాలోంచి గేటు ముందు దిగేసరికి ప్రముఖులు, పురప్రముఖులు అంతా గేటు వద్దే నుంచుని స్వాగతం పలికేరు. హెడ్‌మాష్టరు గారు మెడలో పూలమాల వేసి స్వాగతం పలికారు.

కొత్తగా ఏకగ్రీవంగా మునిసిపల్ చెయిర్మన్‌గా ఎన్నికయిన నాగభూషణం గారి వెంట నడుస్తున్నాడు సీతారామయ్య. ఆయనే సభాధ్యక్షులు దారి కిరువైపులా పూచిన మల్లె పొదల్లా అందంగా ఆనందంగా, విప్పారిన ముఖాలతో, వికసించిన నేత్రాలతో, మనస్సు నిండా గౌరవం, చేతుల నిండా పూలతో నిలుచున్న విద్యార్థినులు సీతారామయ్య గారు నడుస్తుంటే గౌరవ పురస్కారంగా విరిజల్లులు కురిపించారు.

పుష్పాభిషేకం జరిగినట్టనిపించింది.

తన జన్మ ఫలించిందనుకున్నాడు ఆయన.

కొత్తగా రిమోడల్ చేసి, రంగు రంగులతో అలంకరించిన గోడలు, వాటికి అతల్లాగా, మణిదీపాల్లాగ ఏర్పాటు చేసిన కలర్ బల్బ్స్, సరికొత్త మైక్స్, మోడరన్ సీటింగ్, వేదికపైనా కిందా పరచిన రెడ్, బ్లూ కార్పెట్స్‌తో ఇంద్రసభా భవనం లాగా వుంది హాలు.

ఆదర్శాలకీ, ఉత్తమ శిక్షణకీ, క్రమశిక్షణకి, సుగుణాలకి జరుగుతోన్న సన్మానానికి సంతోషిస్తున్నట్టుగా మెర్క్యురీ లైట్లు మరింత తేజస్సుతో వెలుగుతోన్నాయి. ఫ్యాన్స్ తామూ సీతారామయ్యగారి 'ఫాన్స్' అన్నట్టుగా నెమ్మదిగా నిశ్శబ్దంగా తిరుగుతూ మంద మంద మలయానిలాల్ని వెదజల్లుతోన్నాయి.

అంతటా పూలపరిమళం! పద పరిమళం.

ఆత్మీయతతో మంచి మనస్సులు వెదజల్లే మాటల సురభిళం

స్థానిక శాసన సభ్యులు ముఖ్య అతిధిగా విచ్చేశారు. మునిసిపల్ కమీషనర్ శ్రీచందర్ సభా నిర్వహణ. నగరంలోని ఉపాధ్యాయ వర్గమంతా విచ్చేశారు. మచ్చ ఎరుగని

జీవితంలో. ఇటు విద్యార్థి, ఇటు ఉపాధ్యాయ వర్గంలో పేరెన్నికగన్న సీతారామయ్య సన్మానసభ అంటే ఎవరు రారు! ప్రముఖులతో పుర ప్రముఖులతో సభ కిటకిటలాడుతోంది.

స్థానిక కాలేజీ ప్రిన్సిపాల్‌గారు సభ ప్రారంభించారు. ఎత్తయిన వేదికమీద, రంగురంగుల నియాన్‌లైట్ల వెలుగుల సమ్మేళనం మధ్య. నగర వెలుగుల వంటి ఆ పుర ప్రముఖుల మధ్య మాలలో కొలికి పూసలా వున్నారు సీతారామయ్యగారు.

'శిష్య వాత్సల్యము చెలువు దీర్చినమూర్తి, ఆదర్శ ఉపాధ్యాయుడు, ఉత్తమ జీవనుడు, నిగర్వి, సచ్ఛీలి, జీవితంలో తృప్తి తప్ప అసంతృప్తి ఎరుగని మనిషి' అంటూ పొగిడారు తెలుగుశాఖ ప్రధానోపన్యాసకులు.

'ఇంతటి మంచి మనిషి, ఇంత గొప్ప ఉపాధ్యాయుడిని, మన మధ్య యిన్నాళ్ళూ వున్నా మనం గుర్తించలేదు ఈనాడు ఆయనకి జరుగుతోన్న యీ సన్మానం ఉపాధ్యాయ వర్గానికే సన్మానం. ఆయన గుణగణాలకి తగినట్లుగా ఆయన్ని సత్కరించలేకపోయినా యథాశక్తి సన్మానిస్తున్నాం!' అన్నారు ఎమ్మెల్యేగారు.

తర్వాత ఎవరి శక్తికొద్దీ వారు మాటలని పదపరిమళభరితంగా సభపై విరజల్లారు. ఆఖర్న సీతారామయ్యగారిని నాగభూషణంగారు నిలువెత్తుగా మల్లెలతో, జాజులతో, గులాబీలతో, చేమంతులతో అందంగా అల్లిన పూమాలతో సత్కరించారు. మరువం, దవనం వెదజల్లుతోన్న సువాసనలు మీసేవ మేం మరువం అంటున్నట్లుగా వున్నాయి.

శాలువా కప్పేరు... పర్స్ బహూకరించారు. శ్రీగంధం అలదేరు. పన్నీరు చిలికించేరు.

సీతారామయ్య మనస్సునిండా. కళ్ళనిండా తృప్తి. ఆయన కృతజ్ఞతలు చెప్పుకోడానికి లేచారు అరవైమంది విద్యార్థులున్న క్లాసులో పాఠాలు చెప్పారు. టీచర్స్ కాన్ఫరెన్స్‌లు, స్టాఫ్ మీటింగ్‌ల్లో మాటాడారు.

కానీ ఇంత పేరోలగంలో ఏనాడూ నోరు విప్పి ఎరుగడాయన.

'మహాశయులారా! మహనీయులారా!'

ఆయన గొంతుకలో గాద్గదికం! గుండె బరువెక్కింది ఆనందంతో... ఉద్వేగంతో బి.పి. హెచ్చినట్లుగా అయింది. అందర్నీ ఒకచోట చూసేసరికి కళ్ళు నీరు కమ్మినట్లయింది.

"ఈరోజు నాకెంతో తృప్తి వుంది. నా వద్ద చదువుకున్న శ్రీధర్ స్టేట్ ఫస్ట్‌గా వచ్చిన రోజున యింతగా సంతోషించాను. మన పాఠశాల విద్యార్థి జయంతి కలెక్టరుగా వచ్చి నమస్కరించిన రోజున యిలా సంతోషించి, యింతగా ఆనందించాను. ఈ రోజు నా పుట్టిన రోజు. ఒక ఉపాధ్యాయుడికి తన జన్మదినోత్సవం నాడు జరుగుతున్న సన్మానం. యింతకంటే యింకేం కావాలి.

నేను జీవిత కాలంలో ఏమీ మిగుల్చుకోలేదు. పన్నెండుగురు సంతానంతో– నన్ను మన్నించాలి... మా రోజుల్లో సంతానమే సౌభాగ్యం అనుకున్నాం... ఆ రోజుల్లో కుటుంబ నియంత్రణ తెలియదు– లేదు. అధిక సంతానంతో నేను ఆర్థికంగా బాధలు పడినా అందుకేనాడూ విచారించలేదు. నా బొటాబొటి జీతంలో ఏమీ మిగల్లేదు. తల దాచుకోను యిల్లు లేదు... అవసరం వస్తే బ్యాంకిలో ఏమీ మిగుల్చుకోలేదు–. అయినా నాకు విచారమూ లేదు.

ఈ సన్మానం – ఈ గౌరవం – ఈ అభిమానం– ఆత్మీయత యివి చాలు నాకు. మనిషి నిలువెత్తు బంగారం, మణులు, మాణిక్యాలు సంపాదించినా యీ తృప్తి దొరకదు... లభించదు...

ఈ ఆనందం నాకు పరిపూర్ణ తృప్తిని యిస్తోంది. నిరుద్యోగులైన కొడుకులున్నా నిరక్షరాస్యులు కానందుకు నాకు ఆనందంగా వుంది. ఒక పూట తింటేనేం తృప్తికి మించినదేం వుంది? ప్రాప్తమయిన లేశమయినా పదివేలు అనుకొనే మనస్తత్వం నాది.

నేనిలా సభల్లో ఏనాడూ మాటాడి ఎరుగను. ఈ సన్మానంతో నా మనస్సు నిండిపోయి ఏదేదో మాట్లాడాను. మీకు కృతజ్ఞతలు చెప్పటం కంటే యింకేం చెప్పలేను."

సీతారామయ్య కూర్చోగానే కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

సభ ముగిసింది. చెయిర్మన్‌గారు సీతారామయ్యని కార్లో తెచ్చి, యింటివద్ద దిగబెట్టేడు. అది మరో గౌరవం అనిపించింది ఆయనకి.

'ధన్యోస్మి' అనుకున్నారు.

* * *

అర్ధరాత్రి!

గాలిలో ఏదో ఆర్తనాదం వినిపించినట్లయింది. సీతారామయ్యగారి పెద్ద కొడుకు నారాయణ చప్పున లేచి కూర్చున్నాడు. దీపం వెలిగించాడు. మెలికలు తిరిగిపోతున్నాడు సీతారామయ్య.

'నానా! నాన్నా!' ఆదుర్దాగా పిలిచాడు అతను. ఆ పిలుపుకి యింటిల్లిపాదీ మేల్కొన్నారు. తండ్రికి జరుగుతున్న అపూర్వ సన్మానానికి వచ్చిన ఆరుగురు కూతుళ్ళు, అల్లుళ్ళు, వాళ్ల పిల్లలు, ముగ్గురు కోడళ్ళు,



కొడుకులు, మనవలు, మనవరాళ్ళు అంతా క్షణంలో అయన చుట్టూ చేరారు.

అయిదేళ్ళనాటి గుండెపోటు మళ్లీ వచ్చింది ఆయనకి. ఊపిరి అందటంలేదు, యమయాతన పడుతున్నారు. అందరూ గాభరా పడుతున్నారు. అందరి ముఖాల్లోనూ ఆందోళన.

'బాబూ!' ఆయాసంగా పిలిచారాయన.

'నాన్నా!' ఆరు స్వరాలూ ఒక్కసారిగా విషాదాన్ని పలికేయి.

'నా పని అయిపోయింది. నాకు తృప్తిగా వుంది. అందర్నీ ఒక్కసారి చూస్తున్నాను. నాకేం కొరత వుందని... ఒక ఆర్థిక బాధ తప్పితే మనమే విషయానికి బాధపళ్ళేదు. ఉమ్మడి కుటుంబం అసంతృప్తి, సమస్యలు

## మధ్యతరగతి మందహాసం

మనం విరగం.' ఆయాసంతో ఒక్క క్షణం ఆగి మళ్లీ అన్నారాయన–

'ఇప్పుడు అదీ తీరుతోంది!' విశ్వం ఆయన మనస్సులో మెదిలాడు రాము కళ్ళకి కనిపించాడు. "నేను చనిపోతే ప్రభుత్వం పదివేలు ఇస్తుంది. ఇరవై వెల్ల జీతం వస్తుంది. బి. ఏ; బి. ఇడి చదివిన మూర్తికి ఉద్యోగం యిస్తుంది. నా పి. యఫ్. వస్తుంది, ఇన్సూరెన్సు పదివేలు వస్తాయి—'

'నాన్నా!' కొడుకులు వారించబోయారు.

'నా పిల్లలకి చదువులు చెప్పించాను. చేతనయిన ఉద్యోగాలు వేయించాను, అందరమూ అందలాలెక్కలేం కదా! అయినా ప్రభుత్వ ఉద్యోగాలతో ఏం మిగల్చగలం? తృప్తి తప్ప! ఇప్పుడు ఇన్ని సౌకర్యాలనీ నేను సంపాదించినట్టే కదా! ఇదే నే మిగిల్చిపోతున్న ఆస్తి!'

ఆయనకి ఆయాసం ఎక్కువైంది. చూపులో మార్పు వస్తోంది.

తర్వాత ఆయన నోట మాట రాలేదు.

మాటలని కూడదీసుకుని అన్నారు 'కలసి బ్రతకండి! సుఖంగా కలిగిన దాంతో తృప్తిగా జీవించండి.'

ఆయన కళ్ళు బరువుగా మూసుకపోయాయి.

అందరూ గొల్లు మన్నారు.

సీతారామయ్యగారి ఆత్మ తృప్తిగా మరో లోకాలకేసి పయనిస్తోంది....




**బి. ఎస్. పి. ఆర్ – వాల్తేరు**

నాకు 23 సం. ఒక అమ్మాయిని ప్రేమించాను నాకంటే కన్న వయస్సులో పెద్ద. ఆ అమ్మాయి వాళ్లింట్లో ఒప్పించకలదు. కాని నాకు పలుగురు చెల్లెళ్లున్నారు. వీరి పెళ్లి కాలేదు.

ఈడొచ్చి తంతే ఇరవై మూడు లేవు. అప్పుడే ఇంత కథ నడిపావ తమ్ముడూ, ఏ వయస్సులో ఆ పని చేయాలని నీకు పెద్దలు చెప్పినట్టు లేదు. నీకూ తోచినట్టు లేదు. ముందు చదువు చూసుకో ప్రేమకేం. తరవాతైనా దొరుకుతుంది.

**కె. జి. ఎస్. కె. – కుప్పం**

ఈ ప్రపంచంలో మానవుని ఆకర్షణ దేనిలో వుంది?

దేనిలో లేదు? అని అడగాలి. దైనందిన జీవిత సంఘటనల నుండి — తెలియని భవిష్యత్తు దాకా అన్నీ ఆకర్షణీయాలే మానవునికి.

**యు. యు – ఎమ్మిగనూరు**

రచయితకు రచన వేరు, జీవితం వేరా?

కాదా మరి?

మానవుల్ని పీడిస్తున్న అధిక ధరలు ఎప్పటికైనా తగ్గేనా?

తగ్గుతాయి. నూరుని ఒకటిగాను, వేయిని అర్ధరూపాయిగానూ లెక్క పెట్టుకుంటేను.

**డి. వి. ఎస్. ఆర్ – విశాఖ**

అసలు తప్పు చెయ్యని నరుడు...

పొరపాటు. అసలు తప్పు చేయని వాడినని అనుకున్నప్పుడే తొలి తప్పు చేసి వుండాలి.

**బి. బి. పి. – బందరు**

మేడమ్. మాటొచ్చి కూడా మాట్లాడని మనిషిని ఏమనాలి?

మౌనసుందరి [అరె ఆశ్చర్యం మాట్లాడించకుండానే నాలా తెగ వాగుతారే ఆడవాళ్లు. అలాంటిది మాట్లాడించినా మాట్లాడని వ్యక్తి వుందంటే నమ్మకం కుదరడంలే.]

**కె. ఆర్. ఆర్. – హైదరాబాదు**

పురుషుడినైన నాకు చీర కట్టుకొని గాజులు వేసుకోవాలని వుంది. హేళన చేయకుండా సలహా చెప్పగలరు.

ముందు — ఓ మానసిక వైద్యుని సంప్రదించండి.

**బి. ఎస్. డి. – తాపేశ్వరం**

చేతిలో సొమ్ము లేనప్పుడు ముడుచుకు కూర్చుని పది రూపాయలు చేత పడేసరికి అవి ఖర్చయ్యేదాకా నిద్ర పోని వాళ్లనేమనాలి?

సామాన్య మనుషులు. డబ్బు లేనప్పుడెలాగూ వూరుకోక తప్పదు. డబ్బున్నప్పుడు ఖర్చుచేసుకోపోతే ఎలా? అనిపిస్తుంది.

**కె. కె. – గుంతకల్**

ఒకమ్మాయి, ఒకబ్బాయి ప్రేమించుకున్నారు. వారు ఎలా కలవడం అని అడుగుతున్నారు నన్ను. నేను మిమ్మల్ని అడుగుతున్నాను.

మీ సలహా చెప్పేసరికి వాళ్లు విడిపోయి వుంటారేమో! అయినా చెప్తున్నాను. ప్రేమికుల మధ్య మధ్యవర్తిత్వానికి ఒప్పుకోడం తెలివి తక్కువ. వాళ్ల పాట్లు వాళ్లని పడనివ్వండి !!

**వై. వి. ఆర్., వి. వై. ఆర్. – తిప్పగుంటపాలెం**

మానవుని జీవితంలో అతి మధురమైనది, మరువలేనిది ఘట్టమేది?

ఆ రెండు అతనికి తెలియనివే. పుట్టుక, చావు.

**డి. ఎస్. ఆర్. – సికింద్రాబాద్**

రాతిగుండె వుంటే మనిషి రాణిస్తాడా?

మనసు సున్నితంగా వుండాలి. అప్పుడు రాణిస్తాడు.

**జి. ఎస్. ఆర్. – వేంకొండపల్లి**

శీలానికి విలువ నిచ్చే స్త్రీ విలువ ఎంతండీ కె.రా. గారు?

మీరిచ్చుకోలేనంత.

**డి. వి. బి. – హైదరాబాదు**

మన స్వేచ్ఛకీ — స్త్రీ సమానత్వానికీ సంబంధం ఏమిటి?

ఏ స్వేచ్ఛ — దరిద్రంలో, అసమానత్వంలో మనలేదు.

**కబీరు, నారాయణ – తిరుపతి**

ఆడది తప్పు చేస్తే దండించే అధికారం ప్రకృతి పురుషుడికి ఇచ్చింది కదా. పురుషుడు తప్పు చేస్తే దండించే అధికారం స్త్రీకి ఎందుకివ్వలేదు?

పిచ్చి నాయనా? స్త్రీ చేతి బిక్ష పురుషుని పుట్టుక. ఇకనేదే ఏం అధికారం ఇచ్చేదేమిటి? తప్పు చేసినదానికి దండన కాదు — నిర్ధారణ. అనవసరంగా వెర్రి మొర్రి నీతి సూత్రాలు గుప్పించకండి.

**వి. ఎస్. పి. – వెంకటాచలం**

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఇద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం. కాని ఒక పొరపాటు విషయంగా — నెల్లాళ్లు మాట్లాడలేదు. ఇప్పుడు తప్పు తెలుసుకొని క్షమించమంది. స్వీకరించాలా?

రించాలి తమ్ముడూ. నా [illegible] అంతే చేస్తాడు. కాని ఏం లాభం ఈ నెలలో యింకొకరిని గాఢంగా ప్రేమించేసి వుంటాడు. బైగమీ చట్ట విరుద్ధం కనుక ఒకళ్లు తప్పుకోక తప్పదంటాడు. ఆలోచించుకో ప్రకాష్. మానం దక్కించుకో. [లేకపోతే — ఏమిటయ్యా? గంటలో ప్రేమ — గంటలో విరహం, గంటలో త్యాగం అయిపోడానికిది జీవితం — సినిమా కాదు]

**కె. ఇ. ఆర్. – బైపల్లి**

ప్రేమంటే ఏమిటి? పగంటే ఏమిటి? రెంటికీ తేడా ఏమిటి?

ప్రేమ — పగ నాణానికటూ ఇటూ. ప్రేమ వికటిస్తే పగ. పగ అణిగితే ప్రేమ. అంచేత ప్రేమకీ పగకీ అట్టే తేడా లేదు. (ప్రేమకూడా ఒక రకం పగే)

మన నాయకులు ఎలాంటి వారు?

వినాయకులు డబ్బుల రంగెళ్లు. పూజలకీ ప్రసాదాలకీ వరాలిచ్చేస్తుంటారు.



# ఘాటాక్షుని డైరీ



## తీగ లాగితే...!

మహారాష్ట్ర ముఖ్య మంత్రి భోస్లే గారికొడుకు అశోక్ భార్య సవిత నాలుగేళ్ల క్రితం వో రైలు క్రింద పడి, రెండు కాళ్లు పోగొట్టుకున్నదట. కర్ర కాళ్ల సహాయంతో నడవగలిగి, వో బ్యాంకులో ఉద్యోగం చేస్తోందట. ఈమె నుండి విడాకులు కోరి ఆమె భర్త కోర్టులో దావా వేస్తే ఆమె హైకోర్టులో రిట్ వేసి, అందులో తన మామ గారైన మహారాష్ట్ర ముఖ్యమంత్రి భోస్లేగారు నాలుగేళ్ల క్రితం తనమీదపడి,కామదాహం తీర్చు కున్నారని, దాంతో జీవితంమీద విరక్తి చెంది తాను రైలు క్రింద పడి ఆత్మహత్య చేసుకోబోయేసరికి కాళ్లు రెండూ పోయాయని ప్రకటించి, ఈ విష యం ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధికి స్వయానా వెళ్లి చెప్పిందటామె.

## సేలం ఉక్కు !

సేలంలోని స్టీల్ ప్లాంట్ నూట నలభై కోట్ల పెట్టుబడితో రూపం సంపాదించుకున్నదట.ఇప్పుడు స్టెయిన్‌లెస్ స్టీలు రేకుతయారీ ప్రారంభమయిన దట — మరి విశాఖ ఉక్కు ఫ్యాక్టరీయో ! విశాఖ ఉక్కు . . . ఆంధ్రుల హక్కు !

## మామగారి పార్టీలో చేరనన్న అల్లుడు!

మామగారు యన్టీ రామారావుగారు కొత్త పార్టీ పెట్టి రాజకీయాల్లోకి దిగుతున్న వార్తలు చదువుతున్నాను. నేను ఆయన పార్టీలో మాత్రం చేరను. నేను ఆదినుంచీ కాంగ్రెస్ పార్టీయే అని నటుడు ఎన్టీ రామారావు అల్లుడు చంద్రబాబు అన్నారట. ఈయన ఆంధ్రప్రభుత్వంలో మంత్రి.

## న్యాయమూర్తిని హత్య చేసిన బందిపోట్లు !

ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం దోపిడీ దొంగలను పట్టడానికి చాలా తీవ్రమైన చర్యలు తీసుకుంటోం దట. దాంతో యీ దోపిడీ దొంగలు పోలీసులమీద, ప్రభుత్వాధికారులమీదా పగబట్టి ఉన్నారట. అలహా బాద్ హైకోర్టు న్యాయమూర్తి సి. ఎన్. బి. సింగ్‌కు వేట అలవాటున్నదట. అలహాబాద్‌కు 50 మైళ్ల దూరంలో ఉన్న పండాకు చెందిన సర్కార్ అడవులకు తన యిద్దరు కొడుకులతో, స్నేహితులతోనూ వెళ్లి తిరిగి వస్తూండగా రోడ్డుకు అడ్డంగా కొన్ని రాళ్లు పెట్టి వారి జీపుకు అంతరాయం కలిగించి ,భయకరంగా తుపాకీ కాల్పులు ఆరంభించారట. న్యాయమూర్తి సింగ్ కూడా తన తుపాకీతో ఎదుర్కొన్నారట. చివరికి ఆయన గుండెల్లో ఒక గుండు దూసుకుపోయిం దట.ఆయనకొడుకు12ఏళ్ల అజిత్ ప్రతాప్‌సింగ్‌కూ గుండెల్లో గుండు దూసుకుపోయి తండ్రీ కొడుకులిద్దరూ చనిపోయారట. రెండో కొడుకు విక్రమ్‌సింగూ, ఆయన స్నేహితుడు మహేంద్ర సింగూ, జీపు డ్రయివరూ బలమైన గాయాలతో బయటపడ్డారట. వీరిని ఆ బందిపోట్లు పోలీసు లేమోనన్న భ్రమతో కాల్చి చంపారని, ఆనక అయ్యయో! వీళ్లు పోలీసులు కాదులా ఉంది అని ఆ బందిపోట్లనుకోడం తాను విన్నానని మహేంద్ర సింగ్ ఆసుపత్రిలో చెప్పారట.

## చచ్చేముందు అన్యోన్యత !

తమిళనాడుకు చెందిన తిరుచెంగోడులో 28 ఏళ్ల ఈశ్వరన్ రోజూ తప్పతాగి, ఇంటికి వెళ్లి భార్య మనోన్మణిని చితక బాదేవాడట. ఇంట్లోని సామానులన్నీ తెగనమ్మి తాగేస్తూ ఉంటే తాను బ్రతకడానికి ,ఏడాదిన్నరకొడుకుకుతిండి పెట్టడానికి కూడా గతి లేక మనోన్మణిహ చేసేదిలేక నువ్విలా తాగి చస్తే నేను విషం తాగి చచ్చి నీ పీడ వదుల్చుకుంటానన్నదట. దానికా ఈశ్వరన్ నీకన్నా ముందు నేను చస్తాను. ఎవరు ముందు చస్తారో చూద్దాం అన్నాడట. దాంతో మనోన్మణి నల్లుల మందు భటాల్న తాగేసిందట. ఈశ్వరన్ ఎగిరి గంతేసి తాను మరో సీసా ఖాళీ చేసేశాడట. తత్ఫలి తంగా ఇద్దరూ చనిపోయారట. చచ్చేముందిద్దరూ అన్యోన్యంగా చాపమీద పడుకుని ఒకరి నొకరుగట్టిగా కౌగలించుకుని ప్రాణాలొదిలారట.

## హత్యకి దారితీసిన రహస్య ప్రేమాయణం !

తమిళనాడు ధర్మపురికి చెందిన ఏరివళ్లై అనే పల్లెటూరుకు చెందిన 35ఏళ్ల కేరియన్ అదే వూరుకు చెందిన వెంకటరామన్‌భార్య కన్నమ్మతో రహస్య ప్రేమాయణం పెట్టుకున్నాడట. ఈ విష యం వెంకట్రామన్‌కు తెలిసి, భార్యను చివాట్లు వేస్తే ఆమె "పోరా ! నేను అతన్ని ప్రేమించడం మానను, అన్నదట. పంచాయతీలో పంచాయతీ నిర్ణ యాన్ని కేరియన్, కన్నమ్మకూడా ఒప్పలేదట. దాంతో ఇహ తానే చై చేసుకోవాలని నిర్ణయించు కుని, వెంకటరామన్ తన అన్న కొడుకు మనిరాజన్ సహాయం తీసుకుని కన్నమ్మను పొలానికి వెళ్లి ఆ రాత్రి పడుకోమని, వీరిద్దరూ ఇంట్లో కాపే శారట. అర్ధరాత్రి కేరియన్ ఇంట్లోకి జొరబడ గానే అతనిమీదపడి అతని పురుషావయవాన్ని పిసికి చంపి , ఆనక మెడ కోసేశారట.

# భారతి

## మార్చి 1982 సంచికలో


| | |
|---|---|
| ఓ జగన్నటరాజ !! | శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం |
| డా. విలియమ్ కెరే | శ్రీ రామలింగం |
| శాస్త్రీయ దృక్పథం - ఒక అవగాహన | డా. గుమ్మనూరు రమేష్‌బాబు |
| భువనతారలు | శ్రీ వేంపాటి సోమరాజు |
| నేటి తెలుగులో సమాస నిర్మాణం | డా. యస్. శివరామమూర్తి |
| ఉగాది ఎందుకు ? | శ్రీ పులికంటి కృష్ణారెడ్డి |
| దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు | శ్రీ అవటపల్లి నారాయణరావు |
| శివరాత్రి | శ్రీ శనగన నరసింహస్వామి |
| ఈ చీకటి.... | శ్రీ వి. సంపత్కుమారాచార్య |
| పారిజాతాపహరణం - విభిన్న కథనాలు | శ్రీ బులుసు వేంకట రమణయ్య |
| గుడ్ మార్నింగ్ ! | శ్రీ రంధి సోమరాజు |
| శీర్షిక నెత్తుకునే వరకు .... | శ్రీ కందాళై రామవాచార్య |
| ద్వైవిధ్యం | శ్రీ తిరునగరి |
| ప్రభుత్వరంగంలో ఉద్యోగి బృందపాలనా నిర్వహణ. | శ్రీ టి. నరసింహారావు |
| ఒక నూతన మార్గ అవశ్యకత | శ్రీ జి. రామేశ్వరము |
| రజని ముఖము | శ్రీ వజ్ఝల కాళిదాసు |
| పాటు | శ్రీ వి. వి. బి. రామారావు |
| మధ్యతరగతి మనిషి | శ్రీ కె. అంజయ్య |
| ఆంధ్ర మహాభారత నిమంటువు | శ్రీ నిడుదవోలు వేంకటరావు |
| విశ్వబ్రాహ్మణ కవులు | శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి |
| ఆహ్వానం | శ్రీ వేముగంటి నరసింహాచార్యులు |
| ఆగామి శతాబ్దానికి సాహిత్య పురోగమనం | శ్రీ సోమసుందర్ |


**వెల : రూ. 4-00**

## సమస్య

జనాభా, నిరుద్యోగ,
ఆహార, వరకట్నం
సమస్యలన్నీ
ఒక్కొటి లేకుండా పోతే–
'ప్రతి విద్యార్థీ
భోరున ఏడుస్తాడు'
ఇక - పరీక్షలో పడే
జనీరలెస్సీ ఏదో
ఊహించలేక ! ...
అల్లరు, అలజడ్లు,
ప్రమాదాలు, వగైరాలు
వరుసగా తగ్గిపోతే–
'పత్రికల వాళ్ళు
కలవర పడి పోతారు'
ప్రజలకేం వార్తలు అందివ్వాలో
అర్థంకాక ! ...
అసలు - మొత్తం ఇవన్నీ ఒక్కసారి
పత్తా లేకుండా పోతే–
'ప్రతీ రాజకీయ వాదీ
నెత్తీ నోరు బాదుకుంటాడు'
ప్రజలకేం హామీలు ఇవ్వాలో
తెలియక !...

– కోరిమిల్లి సూర్యశంకర్

## ఫాలాక్షుని డైరీ

### ఓర్పుకి పరీక్ష పెడితే ?

ఈరోడ్డుకు చెందిన 37 ఏళ్ళ ఆండి ముత్తు అనే పోలీసు కానిస్టేబులు గత పదమూడేళ్ళుగా తప్పతాగుతూ, తన భార్య జయలక్ష్మిని కాల్చుకు తింటూ ఉన్నాడట. రాత్రానీ ఆగడం ఎక్కువయినా పిల్లల భవిష్యత్తు నాలోచించి జయలక్ష్మి భర్తతో వేరుపడక, అతను పెట్టే బాధలు పడుతూనే ఉందట. మొన్న 15వ తేదీ రాత్రి ఆండిముత్తు తాగి వచ్చి భార్యను చిత్తుగా కొట్టి, ప్రసన్నుడు గాక కొడవలి తీసుకుని చంపురానని పరశురాముడిలా గెంతులు వేసేసరికి జయలక్ష్మి అతని చేతిలోంచి కొడవలి లాక్కొందట. దాంతో వీరావేశం ఎత్తిన ఆండిముత్తు కొడవలియ్, నిన్ను చంపుతా అని మీద పడేసరికామె ఆ కొడవలితో భర్త మెడమీద శక్తి వంచన లేకుండా ఒక్కటేసిందట. దాంతో ఆండి ముత్తు అక్కడికక్కడే రక్తపు మడుగులో పడి చనిపోయాడట. ఆమె చీర మార్చుకుని పోస్టాఫీసుకు వెళ్లి మద్రాసులో ఉన్న తన తండ్రికి, అక్కభర్తకూ తంతి యిచ్చి, ఆనక పోలీసుస్టేషనుకువెళ్లి జరిగింది చెప్పి లొంగిపోయిందట. ★

మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

సబ్బు - ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.






ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

Imageads-M-AP-1527 Tel




(గత సంచిక తరువాయి)

## 13

పొయ్యి సుయ్‌మని ధ్వని చేస్తోంది.

పాలు పొంగి గ్యాస్ పొయ్యి మంట ఆరిపోయింది.

ఆరిపోయిన పొయ్యిలోనుంచి గ్యాస్ బయటికి వస్తోంది.

ఆమెను పక్కకునెట్టి అతను గ్యాస్ పొయ్యి నాబ్ తిప్పాడు. గ్యాస్ రావడం ఆగిపోయింది. కాని గ్యాస్ వాసన ఆ గదిని చుట్టేసింది.

అతను ఆమెను వంటగదిలో నుంచి రెక్క పట్టుకొని బయటికి లాక్కొచ్చాడు.

"ఏమిటండీ అంత పరధ్యాన్నంగా ఉన్నారు ?"

శరత్‌బాబును కనురెప్పలు ఆర్పకుండా చూసింది సుజాత.

ఆమె ఈ ప్రపంచంలో ఉన్నట్టులేదు.

"పొయ్యి ఆరిపోయిందని, మళ్ళీ వెలిగించడానికి అగ్గిపుల్ల గీస్తే, ఏమయ్యేందేదో తెలుసా ?"

ఆమె మనసు మనసులో లేదు.

నిలువుగుడ్లువేసి చూస్తూ నిల్చుంది.

శరత్‌బాబు వంటగది కిటికీలన్నీ తెరిచివచ్చాడు.

హాల్లో ఫ్యాన్ ఆన్‌చేశాడు.

ముఖానికి చల్లని గాలి సోకగానే సుజాత ఈ లోకంలోకి వచ్చింది.

ఏం జరిగిందో అర్థం చేసుకున్నది.

శరత్‌బాబు, ఈ పిచ్చివాడు తనను కాపాడాడు.

ఈ పిచ్చివాడే కొన్ని గంటల ముందు తన ప్రాణం తియ్యడానికి ప్రయత్నించాడు.

ఇతనికి పిచ్చేమిటి ? మానసిక జబ్బేమిటి ?

అతనికి ఆ జబ్బు ఉందని చెప్పేవాడికే అది వుండి ఉండాలి.

అలా ఎవరు చెప్పారూ ?

ఇంకెవరు ? తన భర్తే !

అంటే ? తన భర్తకు మానసిక రుగ్మత ఉన్నదా ?

నో ! నో ! కాదు !

ఈ శరత్‌కే పిచ్చి ! ఇతను పిచ్చివాడు.

తన భర్త, అతను ఉదయం నుంచీ నార్మల్‌గా ఉన్నాడని చెప్పాడుగా ?

అప్పుడప్పుడు మాత్రమే అతనికి మనసు అదుపు తప్పుతుందటగా ?

ఏది ఏమైనా ఇవ్వాళ ఇతను కాపాడాడు. అతని ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనిది.

అసలు తనకేమైంది ? ఏవేవో గత స్మృతులు తనను వెన్నంటి తరిమాయి. అంతే ! తనను తను మర్చిపోయింది. కళ్ళముందు జరుగుతున్నదాన్ని గుర్తించలేకపోయింది.

పొయ్యి ఆరిపోయి ఎంత సేపయిందో ?

గ్యాస్ వాసన వంట గదంతా వ్యాపించిపోయింది.

గ్యాస్ ఎంతసేపు అలా బయటికి వచ్చిందో ?

సమయానికి వచ్చాడు శరత్‌బాబు. లేకపోతే తను ఏమైపోయి ఉండేదో ?

తన ఎదురుగా గంభీరంగా నిలబడి ఉన్న శరత్‌బాబును చూసింది. ఆమె కళ్ళల్లో కృతజ్ఞతా భావం పొంగి వెల్లువ కట్టింది.

"మీకు..." ఆమెకు మాటలు పెగల్లేదు.

"డోంట్ బాదర్ ! కాసేపు రెస్టు తీసుకోండి. ఎవ్విరిథింగ్ విల్ బి ఆల్‌రైట్ !" అంటూ శరత్‌బాబు తన ముఖానికి పట్టిన చెమటను కుడిచేత్తో తుడుచుకున్నాడు.

అతని చేతిమీద మునివేళ్ళు దిగిన గాట్లు కన్పించాయి. సుజాత జాలిగా చూసింది.

చేతికి కట్టు కట్టలేదు.

పాపం ! ఎర్రబడిన గాయాలు ! ఎంత బాధ కలిగిస్తున్నాయో ?

సుజాత మనసు కరిగిపోయింది.

ఏదైనా మందు వేసి కట్టు కడితే మంచిది

ఆయనగారేమిటి అలా చూస్తూ వదిలేశారు ?

ఆ ఆలోచన రాగానే సుజాత పడక గదిలోకి వెళ్ళింది. అక్కడ ప్రసాదు లేడు. మళ్ళీ శరత్‌బాబు దగ్గరకు వచ్చింది.

"వారెక్కడ ?"

"టెలిఫోన్ రిపేర్‌వాళ్ళు వచ్చారు. వాళ్ళతో బయట పోల్ దగ్గర నిలబడి ఉన్నాడు" శరత్‌బాబు చెప్పాడు.

"ఉండండి ఇప్పుడే వస్తా !" అంటూ సుజాత మళ్ళీ పడక గదిలోకి వెళ్ళింది.

ఐదు నిముషాల్లో, ఆయింట్‌మెంటు ట్యూబు, దూది, బ్యాండేజ్ క్లాత్ తీసుకొని శరత్‌బాబు దగ్గరకు వచ్చింది.

"చెయ్యిలా పెట్టండి."

"ఏమిటది?" ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు.

"ఆయింట్‌మెంట్ !"

ఆమె చేతిలోనుంచి ఆయింటుమెంటు ట్యూబు తీసుకొని చూశాడు.

"ఇది పెన్సిలిన్ ఆయింట్‌మెంట్. నాకు పడదు. సల్ఫా పౌడర్ తెప్పించాక చూద్దాంలెండి."

ఏమిటో ఈయన పెద్ద డాక్టర్లా మాట్లాడు తున్నాడు ?

సుజాత మళ్ళీ ఆలోచనలో పడింది.

ఇతను పిచ్చివాడా ?

లేక డాక్టరా ?

పిచ్చి డాక్టరా ?

"టెలిఫోన్ బాగుపడిందిరా శరత్" ప్రసాదు గదిలోకి వస్తూ సుజాతను చూసి ఆగిపోయాడు.

"చూడండీ ! ఆయన చేతికి ఎంత గాయం అయిందో ? సల్ఫాపౌడర్ అట తెప్పించండి. అలా వదిలేస్తే ఇంకేమైనా ఉందా ?" భర్తను చూస్తూ అన్నది సుజాత.

"ఇప్పుడే వెళ్ళి తెస్తాను. ఆఁ నా కాఫీ ఏది ? ఆరిపోయిందా ?"

సుజాత భర్త ముఖంలోకి శూన్యంగా చూసింది.

"అలా బయటికి వెళ్ళొద్దాం పద ! కాఫీ తాగి మందు కొనుక్కొని వద్దాం !" అన్నాడు శరత్‌బాబు.

ఇద్దరూ బయటికి వెళ్ళారు.

సుజాత వంటపనిలో నిమగ్నమైంది.

**జరిగిన కథ - 9 :** ఢిల్లీ కాన్ఫరెన్స్‌కని వెళ్ళిన శివప్రసాద్ అక్కడికి వెళ్ళకుండానే తన ఫ్రెండ్ శరత్‌బాబుతో తిరిగొచ్చిన భర్తను చూసి ఆశ్చర్యపోతుంది సుజాత. తను కాన్ఫరెన్సుకు వెళ్ళి తిరిగొచ్చే వరకు శరత్ ఇక్కడే వుంటాడని చెప్తే ఏం చెప్పాలో తోచక ఆలోచన్లో పడిపోతుంది. ప్రసాద్ ఢిల్లీ వెళ్ళకపోవడానికి గల కారణమేమిటో చెప్పకపోవడంతో, ఏమేమో వూహించుకొంటుంటుంది. నిద్రపట్టక వెర్రి ఆలోచనలను చేస్తున్న సుజాతతో కాంపోజ్ టాబ్లెట్ మింగించి నిద్రపుచ్చుతాడు శరత్. ఇంట్లో జరిగిన కొన్ని సంఘటనలవల్ల న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్‌ను కూడా శరత్‌బాబే పేల్చి వేశాడన్న అనుమానంతో అతన్ని పోలీసులకి పట్టివ్వాలని నిర్ణయించుకొంటుంది. తను వేసుకున్న ప్లాన్ అడ్డం తిరగటంతో చేసేదిలేక తన స్నేహితురాలు సునీత రాకకోసం ఎదురు చూస్తుంటుంది. పరిచయాలయ్యాక సునీతను తన గదిలోకి తీసుకువెళ్తుంది సుజాత. శరత్‌బాబుపై సుజాత పెంచుకొన్న అనుమానాలు వట్టి భ్రమలు మాత్రమేనని రేడియోలో వచ్చిన వార్తల ద్వారా తేలిపోతుంది. అయినా ఆమె అనుమానం మాత్రం అలాగే మిగిలిపోతుంది. శరత్‌బాబుకి 'మతి స్థిమితంలేదు' అని శివప్రసాద్ ద్వారా తెలుసుకొన్న సుజాత అతనిపై తన సానుభూతిని వ్యక్తం చేస్తుంది. సుజాత గత స్మృతుల్లోకి జారుకొంటుంది. సుజాతను చూడటానికి శివప్రసాద్ వస్తాడు.

## 14

"ఏం చేద్దామనుకుంటున్నారూ ?"

విరబూసిన మల్లెపందిరికేసి చూస్తూ అడిగింది సుజాత.

"ఏమిటి ?"

పురుగు తిన్న గులాబి ఆకును మొక్కనుంచి తుంచుతూ అడిగాడు ప్రసాదు.

"మీ స్నేహితుడ్ని."

"నువ్వే చెప్పు !" గులాబి మొక్క మీదినుంచి దృష్టి మరల్చకుండానే అన్నాడు.

గార్డెన్ ఛైర్‌లోనుంచి సుజాత లేచింది భర్త దగ్గిరకు వచ్చింది.

శివప్రసాదు అరవిచ్చిన ఒక గులాబిని తెంపి భార్యకు ఇచ్చాడు.

సాయంకాలం పిరెండలో కనకాంబరాలు జలకాలు ఆడుతున్నాయి. పొద్దుతిరుగుడు పూలు పశ్చిమానికి తిరిగి ముడుచుకొని తలలు వంచుకుంటున్నాయి. వీస్తున్న పిల్లతెమ్మెరలకు తోటలో పూలచెట్లు అలవోకగా తలలు ఊపుతున్నాయి.

"అతడ్ని పంపించివేయండి."

అరచేతిలో గులాబి ముల్లు గుచ్చుకుంది.

శివప్రసాదు చివ్వున తలెత్తి చూశాడు.

"మన పెళ్లి అయి ఎంత కాలం అయిందీ ?"

భర్త ప్రశ్నకు ఉలిక్కిపడి చూసింది సుజాత

తమ పెళ్లికీ అతగాడు వెళ్ళడానికీ సంబంధం ఏమిటి ?

పూలమొక్కల పాదుల్లోనుంచి రెండు నలికల పాములు బరబరా పాకిపోయినయ్.

వచ్చే డిసెంబరుకు సరిగ్గా సంవత్సరం అవుతుంది.

అయినా ఇదేం మనిషి ? ఈయనకు పెళ్ళి.. పెళ్ళిరోజుకూడా గుర్తులేదా ? సంవత్సరం తిరక్కముందే మర్చిపోయాడా ?

అది నిజంగా మతిమరుపా ?

నిర్లక్ష్యమా ! నిరాదరణా ?

సంవత్సరం తిరక్కుండానే తనతోటి కాపరం మొహం మొత్తిందా ? తండ్రి తనను గోతిలోకి నెట్టి తాను ఒడ్డెక్కాననుకుంటున్నాడు. నట్టనడి సముద్రంలోకి తోసి చేతులు దులుపుకున్నాడు.

తను అప్పుడే అన్నది ఈ ముక్కూ మొహం



తెలియనివాడితో పెళ్ళేమిటని ?

*   *   *

"వచ్చాడమ్మా !"

"తను మాట్లాడలేదు."

"బాగా చదువుకొన్నవాడు. ఆస్తిపరుడు. స్ఫురద్రూపి" తండ్రి ఆనందంలో వళ్ళు మర్చిపోయి చెప్పడాన్ని తను గమనించింది.

"ఏం మాట్లాడవేమమ్మా ! కొంచెం వయసు ఎక్కువని సందేహిస్తున్నావా ?" నసిగాడు తండ్రి

సూటిగా తన ముఖంలోకి చూస్తున్న తండ్రి చూపులను తప్పించుకుంటూ తన రెండోవైపు ప్రక్క చూసింది.

"ముప్పై దాటవమ్మా! అతన్ని చూస్తుంటే అంతకంటే పుండవు అనిపిస్తుంది. అన్ని విధాలా నీకు తగిన సంబంధం అని అనుకుంటున్నాను."

తను మౌనంగా దిక్కులు చూస్తుంటే తండ్రి చెప్పుకుపోతున్నాడు.

"వయసంటావా ? అదేమంత పెద్ద తేడాగా నేను భావించడంలేదు. మహా అయితే నీకంటే ఏడేళ్లు పెద్ద అయి ఉంటాడు. ఆ మాటకొస్తే మీ అమ్మకూ నాకు చాలా తేడా ఉంది."

అమ్మ ! అమ్మ ! అమ్మ ఎలా ఉంటుందో తనకు గుర్తులేదు. గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించింది తను.

అమ్మ ఎవరూ !

ఎలా ఉంటుంది ?

"నీ మనసులో ఉన్న మాటేమిటో చెప్పమ్మా!"

"అమ్మ ఎలా ఉంటుందీ ?"

"అది కాదమ్మా నేను అడిగేది ? అతను — ఆ శివప్రసాదు నీకు నచ్చాడా లేదా ? అని."

"ఏ ఊరట ?" తను అడిగింది.

"తూర్పు గోదావరిజిల్లా — అడవి అనో ఏదో చెప్పాడమ్మా !"

"అడివా ?"

"అఁ అఁ! అడివికాదు. జ్ఞాపకం వచ్చింది. కోనసీమ - అవిడి ! అవిడి ! ఇప్పుడు అక్కడ ఎవరూ లేరట."

"అసలు ఆయనకు ఉన్నవాళ్లెవరట ?"

"అయినవాళ్ళు — అదే దగ్గిరవాళ్ళెవరూ లేరట. దూరపు బంధువుల, ఇద్దరి ముగ్గురి పేర్లు చెప్పాడు. ఆ ఇంటి పేరూ అదీ వింటే పూర్వపు జమీందారీ కుటుంబం అనిపిస్తుంది."

"అయితే ఇదేం ఖర్మ ?"

కొండాదెబ్బ వీపుమీద పడ్డట్టు చూశాడు తండ్రి.

ఆ ముఖం ఇంకా తన కళ్ళల్లో కనిపిస్తూనే ఉంది.

"అది నీ ఖర్మ ! నా ఖర్మ! అతడికేమొచ్చింది? మహారాజ పురుషుడు. సిరిరా మోకాలు అడ్డు పెట్టుకుంటున్నావ్. వెదుక్కుంటూ వచ్చిన అదృష్టాన్ని కాదంటున్నావ్. అసలు బుద్ధి తక్కువ నాదే ! తెలిసీ తెలిసీ నిన్నడగడమేమిటి ? సర్వం తెలిసి నేను..." ఉద్రేకంతో ఊగిపోతున్న తండ్రిని చూస్తే తనకు భయం వేసింది.

"అదికాదు నాన్నా నేననేది ? అన్నీ ఉన్నాయన, అంత గొప్ప కుటుంబానికి చెందిన వ్యక్తి ఈ పేపర్లలో పెళ్లాం కావాలని ప్రకటనలు ఏమిటి ?"

* * *

"ఇంకా సంవత్సరం దాటలేదు."

"దేనికి ?"

తృళ్ళిపడి భర్తకేసి చూసింది సుజాత.

ఆమె స్ఫురణకు తెచ్చుకుంటున్న గిత స్మృతులు తెరమరుగైనాయి.

"మన పెళ్ళయి !" భర్త కంఠం ఖంగుమన్నది.

మెట్లమీదనుంచి చెంబూ, పళ్లాలు దొర్లినట్టు చప్పుళ్లు విన్పించాయి.

అయితే ఏమిటంటాడీయన ?

ఎంత ఘోరంగా మాట్లాడుతున్నాడు ?

అది తన జీవితంలో మరపురాని రోజు.

పవిత్రమైన రోజు.

రెండు జీవితాలను శాశ్వతంగా కలిపిన రోజు.

ఈయన ఎంత తేలిగ్గా మాట్లాడుతున్నాడు ?

భర్తను కసిగా చూసింది.

ఆమె కళ్లల్లో నిరసన భావం కొట్టవచ్చినట్టుంది.

"మన పెళ్లయి ఇంకా సంవత్సరం కాలేదు. మన అనుబంధం సంవత్సరం లోపుదే ! మా ఇద్దరిదీ ఇరవై ఏళ్ల ..."

"భార్యాభర్తల సంబంధంతో పోలుస్తున్నారా ? ఛ ! ఛ ! అనుకుంటేనే అసహ్యంగా ఉంది." సుజాత కంఠం కంపించిపోయింది.

"సుజాతా ! పొరపడుతున్నావ్ ?" శివప్రసాద్

## మ న సు క థ

రెండడుగులు ముందుకు వేసి, ఆమె భుజాలను మృదువుగ తాకుతూ "వాట్ ఐ మీన్".

"యస్ ! ఐ నో ! యూ ఆర్ మీన్ !"

"ప్లీజ్ సుజా ! నేను చెప్పేది విను నువ్వు ప్రామిస్ చేశావు గుర్తుందా ? నాతో సహకరిస్తానన్నావ్ — శరత్‌ను నేను ఎంత అభిమానిస్తున్నానో నీకు తెలుసు. వాడు ఇలా అయిపోయినందుకు నేనెంత బాధపడుతున్నానో నీకు తెలియనిది కాదు. ఆ బాధలో ఏదో చెప్పాలని, ఇంకేదో అన్నాను. ఐయామ్ సారీ ! వెరీ వెరీ సారీ !"

సుజాత స్థిమితపడింది.

ఇద్దరూ గార్డెన్‌లో ఎదురెదురుగా మళ్ళీ కూర్చున్నారు.

సంధ్య నీడలు పూలమొక్కలమీద పరచుకొంటున్నాయి.

"అయన్ను ఒంటరిగా బయటికి వెళ్ళనిచ్చారేం ?" సుజాత అన్నది.

ఆమెకు తెలియకుండానే మనసులో శరత్ అంటే జాలి కలిగింది.

> **ప్రగతికి కొలమానం !**
>
> ప్రగతికి కొలమానం
> అంకెల రంకెలు కాదు
> ప్రజల నోళ్లపై
> ప్రతిఫలిస్తున్న కళల అంకం !
>
> — యస్. యస్. రెడ్డి

"పర్వాలేదు." ప్రసాదు హాయిగా నవ్వాడు.

"వాడికేం పర్వాలేదు. చెప్పానుగా ఇప్పుడు నార్మల్‌గా ఉన్నాడని. అతను సమయానికి ఇంట్లో ఉన్నాడు. దేవుడల్లే వచ్చి నిన్ను సమయానికి కాపాడాడు. లేకపోతే ఏం జరిగేదో ? తల్చుకొంటే గుండెలు అవిసిపోతున్నాయి."

"అవునండి ! ఆయనకు నేను ఆజన్మాంతం ఋణపడి ఉండాలి. ఏమిటో మొండివాన్ని. కసాయిదాన్ని. ఆయనకు సహాయం చెయ్యాల్సిందిపోయి..." సుజాత గొంతు పూడిపోయింది.

"సుజా ! నాకు నీ మనసు తెలుసు. నీది జాలిగుండె."

భర్త ముఖంలోకి చూస్తూ తృప్తిగా నిట్టూర్చింది సుజాత.

"అవునూ ! పాపం ! ఆయనకు ఈ మానసిక వ్యాధి ఎలా వచ్చింది ? పొద్దుట చెబుతూ చెబుతూ ఆపేశారు." ఆమె కంఠంలో అపారమైన సానుభూతి ధ్వనించింది.

"పెళ్లయిన కొద్ది కాలానికే ..."

"పెళ్లయాకా ?"

గుండె కొట్టుకోవడం కొద్దికాలం ఆగిపోయినట్టు అయింది ఆమెకు.

"అవును, పెళ్లయిన తర్వాతే..." సాలోచనగా అన్నాడు ఆమె భర్త.

"ఆయన భార్య ఇప్పుడు ఆయనతో ఉండటం లేదా ?"

"లేదు."

"లేచిపోయిందా ?"

పొదరింట్లో, పూలమొక్కల చాటున భార్యాభర్తలు కబుర్లు చెప్పుకుంటున్నారు ?

"సారీ ! యాం ఐ డిస్టర్బింగ్ యూ ?"

శరత్‌బాబు అకస్మాత్తుగా ఆకాశం నుండి ఊడి పడినట్టు అక్కడికి వచ్చాడు.

"నో ! నో ! నాట్ ఎటాల్ ! రావోయ్ శరత్! రా ! రా !" అన్నాడు ప్రసాదు.

సుజాత లేచి నిలబడింది.

ఆమె బుగ్గలు ఎర్ర గులాబులు అయ్యాయి

"మీరెందుకు లేస్తారూ ? ప్లీజ్ కూర్చోండి."

"అమ్మగారూ పిండి రుబ్బిపెట్టాను. వంటగది తుడిచి నేను పోతానమ్మా !" అల్లంత దూరం నుంచే అరిచింది నర్సమ్మ.

"సరే నువ్వెళ్లు !" అని పనిమనిషితో చెప్పి శరత్‌బాబూ, ప్రసాద్‌వైపుకు తిరిగి "ఏం చెయ్యమంటారు ? చపాతీలా ? పుల్కాలా ?" అడిగింది.

"ఏది శ్రమ తక్కువ అయితే అది చెయ్యండి" అన్నాడు శరత్‌బాబు.

సుజాత నవ్వుకుంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

పాపిష్టి ముండ !

ఎలాంటి మనిషి ఎలా అయిపోయాడు ? దాని తిరుగుడు చూస్తే ఈయన మతిపోయి ఉంటుంది అసలు మందేమైనా పెట్టిందేమో ?

స్లో పాయిజనింగ్ !

పెళ్లికాకముందే దానికి మరొకడితో సంబంధం ఉండే ఉండాలి !

అట్లాంటి ముదనష్టపుది పెళ్లెందుకు చేసుకోవాలి ?

కడుపొచ్చి ఉంటుంది.

వాడు దీన్ని మోసంచేసి పారిపోయి ఉంటాడు.

అది దాచిపెట్టి, దాని బాబు ఈయనగారి మెడకుకట్టి ఉంటాడు. ఆ తర్వాత ఆ సంగతి తెలిసి ఈయనకు మతిపోయి ఉంటుంది.

పిచ్చివాడైపోయుంటాడు.

ఇదేమిటి తను ఇలా ఆలోచిస్తున్నది ?

మనిషి పిచ్చివాడవడానికి ఎన్ని కారణాలు లేవు? ఇలా ఎందుకై ఉండాలి ?

ఎందుకా ? పెళ్ళయిన తర్వాతనే అతను అలా అయ్యాడని ప్రసాదు చెప్పాడుగా ?

అదే ... ఆ పెళ్లాం ... ఆ దెయ్యం ...

"సుజాతా !" గది బయటినుంచి ప్రసాదు పిలుపు విన్పించింది.

చెపాతీలు వత్తుతున్న సుజాత ఆలోచనలు పుటుక్కున తెగిపోయాయి.

**(ఇంకా వుంది)**

# మహాబలుడు దారాసింగ్ అంటున్నారు: "బలంగా ఎదగండి, న్యూట్రముల్ మొనగాడవండి."

DARA SINGH

ప్రసిద్ధ మల్లయుద్ధ వీరుడు దారాసింగ్ అభిమానాన్ని న్యూట్రముల్ చూరగొందంటే ఆశ్చర్యం ఏముంది? అముల్ వారి న్యూట్రముల్‌లో శరీర ఆరోగ్యానికీ,బలానికీ కావలసిన ఎన్నో పోషక తత్వాలు పుష్కలంగా ఉన్నాయి—అతి శ్రేష్ఠమైన మాల్ట్, రుచికరమైన కోకో, మీగడ కట్టిన అముల్ పాలు, శక్తితో నిండిన ప్రొటీన్లు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. పైగా, న్యూట్రముల్ రుచి కూడా అద్వితీయం! ఇవన్నీ కూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవాల కంటే ఎంతో తక్కువ ధరకే!




మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001 గుజరాత్

deCunha/GCM/43/TL/82

# గురుస్సాక్షాత్ పరంబ్రహ్మః?

— రాజ్యలక్ష్మి కొలాస్కర్



దగ్గరగా వేసివున్న హాస్టల్ గదితలుపుల్ని నెట్టుకుని తుఫానులా ప్రవేశించి తన మంచంమీద పడింది ప్రమీల. ఉలిక్కిపడి తలెత్తి చూసిన శైలజ ప్రమీల అవతారం చూసి ఆశ్చర్యపోయింది. ముఖం నిండా స్వేద బిందువులు. ఆయాసంతో రొప్పుతోంది పరుగెత్తుకొచ్చినట్లు. "ఏమయింది" అని శైలజ అడగబోతుండగానే ప్రమీల తిట్లవర్షం లంకించుకుంది. దౌర్భాగ్యుడు, వెధవ, దరిద్రుడు ... ఏనాడో మరిచిపోయాననుకున్న అచ్చతెలుగు దూషణలన్నీ ప్రమీల నోట్లోంచి పరంపరలా వచ్చేస్తున్నాయి. శైలజకి ఏమీ అర్థం కావటంలేదు. అయినా ప్రమీల ఆవేశం సంగతి తెలిసివున్నదే కనుక మరీ కంగారుపడలేదు. నిమ్మగా అంది –'ముందు విషయం చెప్పేడువు! ఎవరా దురదృష్టవంతుడు ?'

ఇంకా రొప్పుతూనే చెప్పింది. "ఇంకెవరూ! ఆ శేషాచలం వెధవే! వాడివేషాల గురించి నీకు చాలా




రోజులనుంచీ చెప్తూనే ఉన్నాను కదా! ఇన్నాళ్ళూ మాటలతో సరిపెట్టాడు. ఈ రోజు కార్యరంగంలోకి దుమికాడు."

"ఆ ..." ఊహించలేనంత ఆశ్చర్యం, అపనమ్మకం శైలజ కొద్దిగా తెరిచిన నోరు, విప్పుకున్న కళ్ళు స్పష్టం చేస్తున్నాయి. గబుక్కున కుర్చీలోంచి లేచివచ్చి ప్రమీల చెయ్యి పట్టుకుంది.

"నిజంగానా ?"

"ఆహా ! నేనిక్కడ నీ ముందు కూర్చున్నంత నిజంగా."

"మరి ... మరి ..."

"ఎలా తప్పించుకున్నానంటావు ! నేనపుడు ఇవాక్యుయేషన్ ఛాంబర్‌లో ఉన్నాను. నా చేతిలో ఎర్రగా కాలిన ఇవాక్యుయేషన్ రాడ్ వుంది. దాన్ని వాడి ముఖాని కంటించి, వాడు డామేజి ఎస్సెస్ చేసుకుంటుంటే నేను పరుగెత్తుకొచ్చేశాను."

జరిగింది చెబుతుంటే, ఆ దృశ్యం కళ్ళలో మెదిలి ప్రమీల ఒక్కసారి ఆపాదమస్తకం వణికింది. ప్రకంపనలో భయం, అసహ్యం, కోపం, జుగుప్స. స్వతహాగా ప్రమీల చాలా ధైర్యము రాలయినా ఆ సంఘటన ఆమెను బాగా కదిలించింది. చాలాసేపటి వరకు శైలజకి ఏమనటానికి తోచలేదు. కర్తవ్యవిమూఢురాలిలా అలాగే నించుంది.

ప్రమీల కూడా తీవ్రంగా ఆలోచిస్తోంది. చివరికి శైలజే అడిగింది. "మరేం చెయ్యాలనుకుంటున్నావు ? రిజైన్ చేద్దామనా ?"

శైలజ చెయ్యి తనమీద నుంచి తీసేస్తూ లేచి నిల్చుని చెప్పటం చేసుకుంది. "లేదే! నేను రిజైన్ చెయ్యటం వల్ల తప్పు వాడి కాకపోయినా నేను నష్టపోతున్నాను. పారిపోతున్నాను. వీడికి తగిన గుణపాఠం నేర్పాలి. ఈ రోజు అదృష్టవశాత్తు నేను తప్పించుకున్నాను. రేపు నా స్థానంలో వచ్చే అమ్మాయి తప్పించుకోగలదని నమ్మకమేమిటి ? డైరెక్టర్ దగ్గరకెళ్ళి చెప్తాను. రిటెన్ కంప్లెయింట్ ఇస్తాను."

కదిలిపోతున్న ప్రమీలను చూస్తూ అలాగే నిల్చుంది శైలజ. ఆమెకు ప్రమీల ధైర్యాన్ని అభినందించాలో లేక ఆమె ఆశయ సాధనలో ఎదుర్కోబోయే కష్టాల పరంపరను తలుచుకుని విచారించాలో తెలియటం లేదామెకి.

ప్రమీల, శైలజ రూమ్మేట్స్. ఈ హాస్టలు "ఇనిస్టిట్యూట్ ఫర్ అడ్వాన్స్‌డ్ స్టడీస్ ఇన్ సైన్స్" అనే విజ్ఞాన పరిశోధనా సంస్థకి చెందింది. ఇక్కడ కేవలం పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులు, రిసెర్చి మాత్రం వున్నాయి. ప్రమీల మైక్రోబయాలజీలో రిసెర్చి చేస్తుంటే శైలజ కెమిస్ట్రీలో రిసెర్చి చేస్తోంది.

ప్రమీల తల్లిదండ్రులు విజయవాడలోవున్నారు. ప్రమీల విశాఖపట్నంలో యమ్. యస్సి. చదివింది ఫస్ట్‌రాంక్‌లో పాసయ్యింది. ఆమె ఎక్కడ చదివినా, బ్రిలియంట్ గర్ల్ అనే బిరుదు ఆమె ప్రయత్నం లేకుండానే వచ్చేసేది. రిసెర్చికి హైదరాబాదులోని ఈ ఇనిస్టిట్యూట్‌కి వచ్చేసింది. ఇక్కడ అడ్మిషన్ దొరకటం చాలా కష్టం. కాంపిటీషన్ ఎక్కువ. ఎంట్రెన్స్ పరీక్ష, ఇంటర్వ్యూ చాలా కఠినంగా వుంటాయి. దేశం నలుమూలల నుంచి అభ్యర్థులుంటారు. కాని సెలెక్టెడ్ లిస్టులో మొదటి పేరు ప్రమీలదే! అత్యుత్సాహంతో రిసెర్చి మొదలుపెట్టింది. కేన్సర్‌కి వేక్సిన్ కనిపెట్టాలని మానవ చరిత్రలో, సైన్సులో తనపేరు చిరస్థాయిగా నిలిచిపోవాలని, సాల్క్, జొనాస్‌సాక్, మాడమ్‌క్యూరీ వంటివాళ్ళ జాబితాలో తనపేరు చేరాలని ఆమె ఆశయాలు. సాధించగలననే నమ్మకం, పట్టుదల కూడా ఉన్నాయామెలో.

కాని చేరిన సంవత్సరంన్నరకంతా ఆమె ఉత్సాహం నీరుకారిపోసాగింది. ఎప్పటికప్పుడు అక్కడ రిసెర్చి కంటిన్యూ చెయ్యడానికి మనసు ఎదురు తిరుగుతుంటే ఎలాగోలా సమాధానపెట్టుకుంటూ వస్తోంది. దీనికి కారణభూతుడు ప్రమీల రిసెర్చిగైడు ప్రొఫెసర్ శేషాచలం. అతనికి వృత్తిపరంగా మంచి ఖ్యాతి వుంది. వయసు సుమారుగా యాభై సంవత్సరాలుంటుంది. అతనికి విపరీతమైన స్త్రీవ్యామోహం. పెళ్ళయిన నాలుగేళ్ళకే అతని భార్య, అతని స్త్రీలోలత్వాన్ని భరించలేక డైవోర్సు ఇచ్చేసింది. ఆమె వెళ్ళిపోయిన దగ్గర్నుంచీ శేషాచలం మరింత విజృంభించేడు. ప్రమీల జాయిన్ అవటానికి కొంచెం ముందుగా థీసిస్‌సబ్మిట్‌చేసి ఫారిన్ వెళ్ళిపోయిన షీలాని, వచ్చిన కొత్తలోనే అనేక విధాలుగా బెదిరించి లొంగదీసుకున్నాడు. నాలుగు సంవత్సరాలు అతని అవసరాలన్నీ నిరాఘాటంగా తీరిపోయాయి. వీళ్ళ వ్యవహారం క్రమక్రమంగా ఇనిస్టిట్యూట్ మొత్తం తెలిసిపోయింది. శేషాచలాన్ని వేలెత్తిచూపే దమ్ములు ఎవరికీ లేవు. ఇంక షీలా తనని తాను అందరి మాటిపోటి మాటలబారినుండి తప్పించుకోవటానికి నెగెటివ్‌నెస్‌ని కవచంగా ధరించటం నేర్చుకుంది. అందరితోనూ కరుస్తున్నట్లు మాట్లాడేది. థీసిస్ సబ్మిట్ చేసిన వెంటనే ఫారిన్ వెళ్ళిపోయింది, అక్కడే స్థిరపడిపోవడానికి. ఇండియాలో ఏ మూల వున్నా ఇనిస్టిట్యూట్ ముఖాలు కన్పిస్తూనే వుంటాయి. అందుకే ఆమెకు ఇండియాలో వుండటానికి ముఖం చెల్లలేదు. కేవలం శేషాచలం పుణ్యమాని, ఆమె ఆత్మీయులందరికీ దూరంగా వెళ్ళిపోయింది.

షీలా వెళ్ళిపోవటంతో ఒడ్డునపడిన చేపలా కొట్టుకుంటున్న శేషాచలానికి ప్రమీల దైవం పంపిన కానుకలా కన్పించింది

శేషాచలం స్వభావం అందరికీ తెల్సినా ప్రమీలకి ఎవళ్ళు ఒక్కమాట చెప్పలేదు అతని వ్యసనం గురించి. ప్రమీల అడగలేదనికాదు. జాయినయ్యేముందు చాలామంది సీనియర్సు దగ్గరకెళ్ళి వాళ్ళ కౌన్సిల్ తీసుకుంది. అందరూ అతని అకడెమిక్‌వర్కు గురించి చెపుతారు తప్ప ...

అసలు ప్రతివ్యక్తిలోనూ ఎంతో కొంత పైశాచిక ప్రవృత్తి నిబిడీకృతమై వుంటుందేమో! ప్రమీల అనబడే మేకకు తాను వధ్యస్థానానికి కోరి

## గురు సాక్షాత్ పరబ్రహ్మః?

వెళ్తున్నానని తెలియదు. చుట్టువున్న వాళ్ళకు తెలుసుకాని వాళ్ళు చెప్పరు. తీరా వెళ్ళినతరువాత మేక ప్రాణభయంతో గిజగిజలాడుతుంటే గిలిగిలి కొట్టుకుంటుంటే వినోదించవచ్చు అనుకుంటారు.

ప్రమీల చురుకు, చలాకీతనం శేషాచలం కోరికలకు ఆజ్యంపోసేవి. ఆమెవర్కులో కొంచెం వెంటొక్కకోగానే సామ దాన భేద దండోపాయాలు ఒకటొకటిగా ప్రయోగించటం మొదలుపెట్టాడు. ప్రమీలకి ముందు భయం అసహ్యం తరువాత మొండితనం కలిగాయి. ఒక్కసారి వేరేచోటికి వెళ్ళిపోదామా అనుకునేది. కాని ఇక్కడున్నన్ని పరికరాలు, సదుపాయాలు దేశంలో మరెక్కడాలేవు. అదీకాక కెరియర్‌లో ఒక్కసారి బ్రేక్‌పడిందంటే ఉత్సాహం చచ్చిపోతుంది. తన జాగ్రత్తలో తనుంటే సరి అనుకుంది. లాబ్‌లో అందరికంటె తనతో స్నేహంగా, సహాయకరంగా వుండే సీనియర్ రమణ మూర్తితో తన అవస్థ చెప్పుకుంది. రోజూ అతని వర్కు అయిపోయినా, లాబ్‌లో అందరూ వెళ్ళిపోయినా, తనపని అయ్యేవరకు ఏదో ఒకపని చేస్తున్నట్లు నటిస్తూ తనకు రక్షణగా వుండమని ప్రాధేయపడింది. రమణమూర్తి, తను ఆమెకు పనీడలా వుంటాననీ నిర్భయంగా వుండమని మాటిచ్చాడు.

ఈమధ్యన శేషాచలం ప్రమీలకి ఏదో ఒకవర్కు పురమాయిస్తూ సాయంత్రం పూట చాలాసేపటి వరకు ప్రమీలని లాబ్‌లోనే ఉంచెయ్యాలని చూస్తున్నాడు. అతని ఉద్దేశ్యం గ్రహించిన ప్రమీలకి మూర్తి అభయంతో నిశ్చింత ఏర్పడింది. ఇంకో రెండేళ్ళు కష్టపడితే అయిపోతుంది. మూర్తి వెళ్ళిపోయాక ఇంకోళ్ళని బ్రతిమాలుకుంటుంది. లాబ్‌లో మూర్తి, రూమ్‌లో శైలజ సాంత్వన వచనాలతో ప్రమీలకి చాలావరకు భయం తగ్గింది.

ప్రమీలకి మూర్తి గొడుగులా నిలవటం శేషాచలం గమనించాడు. అతనికి ఒంటికి కారం రాసుకున్నట్లయింది. మూర్తిమీద పళ్ళు పటపట లాడించుకున్నాడు. సమయం కోసం చూస్తున్నాడు

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటవుతోంది లాబ్‌లో మిగిలిన స్టూడెంట్సంతా వెళ్ళిపోయారు ప్రమీల ఇవాక్యులేషన్ ఛేంబర్‌లోవుంది. భోజనానికి వెళ్ళటానికి మూర్తి ప్రమీల కోసం ఎదురు చూస్తున్నాడు. శేషాచలం ఇదే సమయమనుకున్నాడు. మూర్తి ని పిల్చి కేంటీన్‌కి వెళ్ళి భోజనం తీసుకు రమ్మన్నాడు. ఈ సమయంలో కేంటీన్‌లో చాలా రష్‌గా వుంటుంది. భోజనం పాక్ చేయించేసరికి కనీసం పావుగంట. నడిచి వెళ్ళటానికి రావటానికి ఇంకో పావుగంట.

శేషాచలం తన దగ్గర రిసెర్చి చేస్తున్న స్టూడెంట్లందరూ తనకి ఇన్స్టిట్యూట్ ప్రొవైడ్ చేసే జీతం బత్తెంలేని సేవకులనుకుంటాడు. వాళ్ళతో నానా చాకిరీ చేయించుకుంటాడు. కాంటీన్ నుంచి తనకోసం లాబ్‌కి కాఫీ, టిఫిన్, భోజనం వాళ్ళే చేరెయ్యాలి. అతనికి ఎవరైనా అతిథులు వస్తే వీళ్ళే తమ స్వంత ఖర్చుమీద వాళ్ళని నగర దర్శనం చేయించాలి. అతనెక్కడ క్యాంప్ వెళ్ళాల్సి వస్తే స్టూడెంట్సే టికెట్ బుక్‌చేసి, అతని లగేజి మోసుకెళ్ళి ట్రెయిన్‌లో పెట్టాలి. భార్యవున్న రోజుల్లో ఇంట్లోకి కూరగాయలు తేవటం, పిల్లల్ని స్కూలుకి తీసుకెళ్ళి తీసుకురావటం...ఒక్కమాటలో చెప్పాలంటే స్టూడెంట్సుకి ఆత్మాభిమానం వుండ కూడదు. వుందో, అతను సంవత్సరాల తరబడి అలా రిసెర్చి చేస్తూనే వుంటాడు.

మూర్తి ముందు కాంటీన్‌కెళ్ళడానికి సందేహించాడు. అయినా తప్పదు. ఇంకో అయిదునిమిషాల్లో ప్రమీల పని అయ్యి వెళ్ళిపోతుంది. మిట్టమధ్యాహ్నం ఏం చేస్తాడులే అని సమాధానపడి బయలుదేరాడు.

మూర్తి లాబ్ దాటగానే శేషాచలం పిల్లిలా రూమ్ తలుపు తెరుచుకుని వెళ్ళి వెనుక నుంచి ప్రమీలను తన కబంధ హస్తాల్లో బిగించాడు. ఆ రూమ్‌లో కంటామినేషన్‌కి అవకాశం లేకుండా కిటికీలు వెంటిలేటర్లు ఏమీ ఉండవు. తలుపు తప్ప వేరే గాలిదూరే సందుండదు. ఆ గదిలో ఏం జరుగుతున్నా బయటవాళ్ళకి ఈషణ్మాత్రం తెలియ రాదు.

ప్రమీల ఒక్కక్షణం భయంతో బిగుసుకు పోయింది. ఆమె కుడిచేతిలో ఇవాక్యులేషన్ రాడ్ ఇంకా బున్సెన్ బర్నర్ ఫ్లేమ్‌లా కాలుతూనే ఉంది. సమయస్ఫూర్తితో తనని తాను రక్షించుకుని బయటపడింది.

* * *

డైరెక్టరుతో ప్రమీల ఇంటర్వ్యూ ఆమె ఆవేశాన్ని ఉక్రోషాన్ని, పదింతలు పెంచింది. ఆమె చెప్పిందంత విని డైరెక్టరు నిదానంగా అన్నాడు — "నాకు తోచిన పరిష్కారం నువ్వు ఇక్కడ నుంచి రిజైన్ చేసెయ్యటం. నీకు ఏదైనా యూనివర్సిటీలో అడ్మిషన్ దొరికేట్టు నేను చూస్తాను."

ప్రమీలకి ఒళ్ళు మండిపోయింది. బోడిసలహా అనుకుంది. కొంచెం దురుసుగానే అంది. "సర్ నాకు ఎక్కడ అడ్మిషన్ కావాలన్నా ఎవరి సహాయం అక్కర్లేదు. నా మెరిట్ చాలు. కాని ప్రొఫెసర్ ఘోరమైన ప్రవర్తనకు మీరు బాధ్యతగల డైరెక్టరుగా అతన్ని శిక్షించలేరా? నా తప్పేమీ లేకపోయినా నేరస్తురాలిలా నేనే చోటు విడిచి పారిపోవాలా ?"

డైరెక్టరు కొంచెం గొంతుపెంచిఅన్నాడు — "చూడు మిస్ ప్రమీలా! మీ యువతరానికిఆవేశమేకాని ఆలోచనలేదు. నేను అతనిపై యాక్షన్ తీసుకోవ టానికి కేవలం నీ మాట ఆధారం చేసుకోవాలి ఏ విధమైన సాక్ష్యంలేదు. నువు నిజంచెప్తున్నావని నమ్మకం ఏమిటి ?"

ప్రమీల అవాక్కయిపోయింది "సర్ ఏ ఆడ పిల్లా తన శీలానికి సంబంధించిన విషయంలో అబద్ధపు న్యాయాన్ని ఆశించదు, అడగదు"

"మిస్ ప్రమీలా! వాదనలు అనవసరం. అతనిపై ఏ విధమైన చర్యతీసుకోవటం అసంభవం వేరేచోట చేరాలనుకుంటే నా సహాయం ఎప్పుడూ వుంటుంది. లేదంటే ఇక్కడే వేరే గైడుతో నీ వర్కు కంటిన్యూ చెయ్యి. ఇంక నువ్వెళ్ళొచ్చు"

నిలువెల్లా మండుతూ బయటకొచ్చింది ప్రమీల. సరాసరి లాబ్‌కెళ్ళింది. అక్కడ శేషాచలం

gelavaṇḍi

# గెలవండి

# బంగారం! బంగారం! బంగారం!

## స్కోర్ లక్కీ గిఫ్ట్ స్కీమ్

మొదటి బహుమతి
35 తులముల బంగారం
లేదా
రు 65.000 నగదు
మరియు
అమూల్యమైన 181
ఇతర బహుమతులతో

1-4-1982 నుండి
30-6-1982 వరకు

డ్రా : 31-7-1982

## ఉచితం!

ప్రతి రెండు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలతో ఒక లక్కీ బహుమతి కూపన్ ఉచితం। ప్రజల సమక్షంలో నిర్వహింపబడే కూపన్ డ్రాలో బహుమతి విజేతలు ప్రకటింపబడుదురు।




మరింతగా మీరు కొనసాగినంత ఎక్కువగా స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలను కొనండి। మీరు బహుమతులు గెలుచుకునే అవకాశాలు పెంపొందించుకోండి।

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వారా ఈ స్కీమ్ అనుమతింపబడినది.










లేదు. కాలినగాయానికి, దెబ్బతిన్న అహానికి సపర్యలు చేసుకుంటున్నాడు. మూర్తితో విషయమంతా చెప్పింది. అతను నిర్ఘాంతపోయాడు. ప్రమీల తను ఏంచేయదల్చుకుందో కూడా చెప్పింది. దానికి మూర్తి హృదయపూర్వకంగా ఆమోదించాడు. ప్రమీలకి ఆవేశం, ఉక్రోషం వీటివెనుక ఆలోచన మరుగుపడిపోయింది. తన నిర్ణయం యొక్క పర్యవసానం ఎలావుంటుందో ఆమెకు ఏ మాత్రం తెలియటంలేదు.

మూర్తి ప్రమీలకల్సి స్టూడెంట్స్‌యూనియన్ ప్రెసిడెంట్‌ని, సెక్రెటరీని కలవటానికి బయలుదేరారు. వాళ్ళు విషయమంతావిని ప్రమీలని హాస్టల్‌కి పంపేశారు. ఇంకో అరగంటలో మహారణ్యంలో దావానలంలా ఈ వార్త ప్రాకిపోయింది. సమ్మెకి పిలుపు నివ్వబడింది. సమావేశాలు, చర్చలు. సాయంత్రానికల్లా గోడలనిండా పోస్టర్లు వెలిశాయి.

''శేషాచలాన్ని డిస్మిస్ చెయ్యాలి''

''కామపిశాచి శేషాచలం ముర్దాబాద్''

''దయచేసి వేరండి! ఇచ్చట మానభంగములలో శిక్షణ ఇవ్వబడును.''

''అమ్మాయిలూ ! బివేర్ ఆఫ్ శేషాచలం''

''ఇక్కడ శేషాచలం వున్నాడు జాగ్రత్త'' ఇంకా ఎన్నెన్నో! శేషాచలం గడ్డిబొమ్మ కాంపస్ అంతా ఊరేగించి తగలెట్టారు. చివరికి వాడి నోటితోటే నిజం చెప్పిద్దాం పదమంటూ శేషాచలం ఇంటికి పెద్దగుంపు బయల్దేరింది. మహోద్రేకుడుగా వెళ్ళినవాళ్ళని తాళంకప్ప వెక్కిరించింది. విద్యార్థుల స్వభావాన్ని కాచి వడబోశాడు. ఆనోట ఈనోట వార్త అతనివరకు పాకగానే ఓ చిన్న సూట్‌కేస్ తీసుకుని పరారైపోయాడు. నిరుత్సాహంతో వెనక్కి మళ్ళారు.

మర్నాడు విద్యార్థులంతా కలిసి డైరెక్టరు ఛాంబర్స్ చుట్టూ చతికిలబడిపోయి ఘెరావ్ మొదలు పెట్టారు. శేషాచలాన్ని సస్పెండుచేస్తే తప్ప కదలమన్నారు

తొంభై శాతం విద్యార్థులకి సమ్మె అనగానే ఎక్కడలేని ఉత్సాహం. కాని ఆ సమ్మెకు మూలమైన కారణానికి నిజమైన సానుభూతి వుంటుందా అనేది అనుమానాస్పదమే! అక్కడున్న గుంపులో చాలమంది నోట సమ్మెకు దారితీసిన సంఘటనపై

## గురు సాక్షాత్ పరబ్రహ్మః?

వెకిలిగా వ్యాఖ్యానాలు, హాసపరిహాసాలు వినవస్తున్నాయి. ఇవన్నీ విని భరించలేక,ఎదిరించలేక మూర్తి హాస్టలుకు వెళ్ళిపోయాడు.

ఎక్కడచూసినా విలేఖరులు. తమను వాళ్ళు అడగటమే మహాభాగ్యంగా భావించి, విద్యార్థులందరూ తలోక కథ తమకు తోచిన విధంగా చెప్తున్నారు.

ఉపాధ్యాయ వర్గంలో ఎన్నడూ పొరపాటున కూడా కన్పడని సమైక్యత ఒక్కసారి విజృంభించింది. శేషాచలానికేదో విపరీతమైన అన్యాయం జరిగిపోతున్నట్లు భావించారు. ''ఆ అమ్మాయి నిజం చెప్తోందని నమ్మకం ఏమిటి? ఈరోజు ఇలా శేషాచలానికైంది రేపు మనకవుతుందని'' ఒకరంటే,

''బజారు మనుషులందరూ రిసెర్చి కొస్తే ఇలాగే వుంటుంది'' అని మరో ప్రబుద్ధుడు. ఈయనకి ఇద్దరు కూతుళ్ళు. కాలేజీలో చదువుతున్నారు. వాళ్ళల్లో ఒకళ్ళకి ఇలాంటి అవస్థపడితే! తన కూతురినీ బజారుదని మరెవరైనా అంటే ఆయన భావాలు ఎలా వుంటాయో?

వీళ్ళంతా కదిలి ఘెరావ్ చేస్తున్న విద్యార్థుల దగ్గరకి బయల్దేరారు. ఒక్కొక్కళ్ళుగా విడిపోయి విద్యార్థులలో కలిసిపోయి మంతనాలు మొదలెట్టారు. కొంచెం పిరికి మనస్తత్వం ఉన్న విద్యార్థుల్ని ఒక్కొక్కళ్ళని గుంపు కవతలకి తీసుకుపోయి ''నీకు పాసయి ఇన్స్టిట్యూట్ వదిలి వెళ్ళాలని లేదా ఏమిటి?'' ''నీకు మంచి గ్రేడ్సుమీద ఏ మాత్రం ఆశ లేనట్టుందే'' ''ఏమోయ్! నీకు డిగ్రీ వద్దేమిటి ?'' ఇలా పిచ్చుకలమీద బ్రహ్మాస్త్రాలు ప్రయోగింపబడుతుంటే నెమ్మది నెమ్మదిగా గుంపు పలచబడ సాగింది. సాయంత్రానికి చాలామంది నీరసంతో వెలిపోతున్నారు.

సమయం పక్వమైందనుకుని డైరెక్టరు బయటికొచ్చాడు. ఒక్కసారి నినాదాలు మారుమ్రోగాయి. అవి కొంచెం అణిగాక మాట్లాడటం మొదలుపెట్టాడాయన. ''మీరు ఆవేశం లేకుండా నా మాటలు వినాల్సిందిగా విన్నవించుకుంటున్నాను. దోషులని శిక్షించాలని, నాకూ వుంది. కాని ఆ శిక్షించే విధానం నా పొజిషన్‌కే ప్రమాదం లేకుండా వుండాలి కదా! శేషాచలం తప్పక సస్పెండు చేయబడతాడు. కాని దానికి ముందు ప్రైమాఫేసీ కేసు ఎస్టాబ్లిష్ చేయవలసి వుంటుంది. దానికి కొంత కాలం పడుతుంది.

విద్యార్థులలో తర్జనభర్జనలు మొదలయ్యాయి. ఆఖరికి విద్యార్థి నాయకుడు ముందుకివచ్చి అన్నాడు ''సర్! అదేదో జరిగేవరకు మేము సమ్మె కొనసాగిస్తాం.''

''అది మీ యిష్టం'' డైరెక్టరు అన్నాడు.

మర్నాడు ఇన్స్టిట్యూట్ నిరవధికంగా మూసి వేయబడిందని పేపరు ద్వారా ప్రకటించారు. హాస్టల్సు మూసివేయబడ్డాయి.

వివిధ వార్తాపత్రికలు వివిధ రకాల మసాలాలతో ఈ వార్తను ప్రచురించేయి. ''ప్రొఫెసరుచే రిసెర్చి విద్యార్థిని మానభంగం'' అని ఒకటి. ''ఇన్స్టిట్యూట్‌లో ఇటువంటివి అతి సామాన్యమైన సంఘటనలని'' మరొకటి. ఇవన్నీ చదవగానే, చదువుకుంటున్న ఆడపిల్లల తల్లితండ్రులు ఏమైన తమ కూతుర్ని ఆ ఇన్స్టిట్యూట్‌కి పంపించకూడదని నిర్ణయించుకుంటే, పెళ్ళికి సన్నద్ధులవుతున్న బ్రహ్మచారులు ఆ ఇన్స్టిట్యూట్‌లో చదివిన, చదువుకుంటున్న అమ్మాయిల్ని ఎట్టిపరిస్థితులలోనూ పెళ్ళి చేసుకోకూడదని తీర్మానించేసుకున్నారు.

అందరితోపాటు ప్రమీల కూడ ఇంటికి వెళ్ళిపోయింది. ప్రమీల చెప్పిందంతా వినేసరికి ఆమె తల్లితండ్రులకి మతిపోయింది. పేపర్లలో చదివి ''ఎవరో పాపం ఆ అమ్మాయి'' అనుకుంటున్నారు. తెలిసేసరికి వాళ్ళ అవస్థ వర్ణనాతీతం. తల్లి ఏడుస్తూ కూర్చుంది ... తండ్రి ప్రమీలని కొట్టినంత పనిచేశాడు. తెగతిట్టాడు.

''ఇన్నాళ్ళుగా వాడు నీ వెంటబడుతుంటే ఎప్పుడో మానెయ్యాల్సింది. నీకు రీసెర్చి చెయ్యాలంటే ఇంకో స్థలమే దొరకలేదా ? దేశం గొడ్డుబోయిందా ? పోనీ అయిందేదో అయింది. మానం దక్కింది చాలని మూటాముల్లె సర్దుకుని వచ్చెయ్యక ఇలా వీధికెక్కుతావే ? ఇక్కడ అమ్మ, అయ్య అఘోరించిపోతారని జ్ఞానం లేకపోయిందా నీకు ? ఇంక మీ ఇద్దరికీ ఈ జన్మలో పెళ్ళిళ్ళవుతాయా ? కూతురివై పుట్టి శత్రువుగా సాధిస్తున్నావే'' ఇంకా ఎన్నెన్నో.






OBM-7967 TL

# చెమటతో వళ్ళు పేలినప్పుడు...




జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడర్ మీకు ఎండనుంచి తక్షణమే ఉపశమనాన్ని యిస్తుంది, ఎందుకంటే దానిలో 3 రకాలుగా ప్రభావితంగా పనిచేసే, ఋజువైన ఔషధీయుక్తమైన ఫార్ములా ఉంది.

- అది క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చెదుటను పీల్చుకుంటుంది.
- దురదనుంచీ, మంటనుంచీ ఉపశమనం యిస్తుంది—తక్షణమే.

# జాన్సన్స్*
## ప్రిక్లీ హీట్ పౌడర్‌తో ఉపశమనాన్ని పొందండి.




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది.

* Trademark © J&J '82

**ఎండలో తక్షణమే ఉపశమనం!**

Johnson & Johnson*

తల్లి ఆవేదన, తండ్రి నిరాదరణ, చెల్లెలి ముభావం వీటన్నిటితో ప్రమీలకు రోజు గడవటం దుర్భరంగా ఉంది.

డైరెక్టరు "వన్‌మాన్ ఎంక్వైరీ కమిషన్"ని నియమించాడు. ఆయన దగ్గర్నుండి ప్రమీలకు పిలుపు వచ్చినపుడు తండ్రి ససేమిరా వెళ్ళనివ్వలేదు. శైలజ వెళ్ళి, ప్రమీల తనతో ఆర్నెల్లుగా శేషాచలం తనని లొంగిపొమ్మని ఒత్తిడిచెయ్యటం గురించి చెప్తోందని వివరించింది. మూర్తి ఏమనుకున్నాడో, శేషాచలంమీద ఎన్నాళ్ళుగానో పేరుకుంటున్న ద్వేషమంతా కక్కేశాడు. ప్రమీల స్వభావం గురించి, శేషాచలం లీలల గురించి, ఆఖరికి షీలాని ఎలా లొంగదీసుకున్నదీ అన్నీ వ్రాతపూర్వకంగా స్టేట్‌మెంట్ ఇచ్చాడు.

ఇంక శేషాచలం పోలీసు బందోబస్తుతో ఎంక్వైరీ కమిషన్‌వారికి స్టేట్‌మెంట్ ఇవ్వటాన్కి వచ్చాడు. అతను అందమైన కథ అల్లి చెప్పాడు. వివిధ వార మాస పత్రికల ద్వారా ఆ కథని ప్రచారం చేశాడుకూడా. అదేమంటే, ప్రమీల రమణమూర్తి ప్రేమించుకున్నారట. లాబ్‌లోనే బాహాటంగా సరస సల్లాపాలాడుతుంటే తను సహించలేక వారించినందుకు, ఇద్దరూ కూడబలుక్కుని తననిలా అల్లరి చేశారట. తనదగ్గర రిసెర్చి చేస్తున్న మరో స్టూడెంటుని భయపెట్టి అదే కథనాన్ని వల్లెవేయించాడు. ఇంకా ఇలా అన్నాడు. "నాకు స్త్రీ సుఖం కావాలంటే డబ్బు పారేసి కావల్సిన అందం కొనుక్కోగలను. ఏం మెరిసిపోతోందని ఈ అమ్మాయి వడగాలి ?"

ఎలాగైతేనేం ? శేషాచలం సస్పెండ్ చేయబడ్డాడు. ఇన్‌స్టిట్యూట్‌యథాప్రకారం మొదలయింది. కేసుని వివరంగా విచారణ చేసి తగిన శిక్ష విధించటాన్కి ఎక్కువ సభ్యులతో మరో ఎంక్వైరీ కమిషన్ త్వరలో ఏర్పాటు చేయబడుతుందని డైరెక్టరు ప్రకటించాడు. త్వరలో అంటే ఎప్పుడని ఎవరూ ఆయన్ని అడగలేదు. ఆయన చెప్పలేదు.

ఈ సమ్మె గొడవలో నెల రోజులు వృధా అయ్యాయి. కోర్సులు పూర్తిచెయ్యటం కోసం ఉపాధ్యాయులు ఎక్స్‌ట్రా క్లాసులు తీసుకుంటున్నారు. విద్యార్థులకు ఊపిరి సలపటంలేదు. శేషాచలం లాబ్ అతని ఆబ్‌సెన్స్‌లో కూడా నిరాఘాటంగా సాగుతోంది. లాబ్‌లో ప్రమీల లేకపోవటం మూర్తికి మనసులో ముల్లు గుచ్చినట్లుండేది. లాబ్‌లో సందడంతా ఆమెతోనే వెళ్ళిపోయినట్లుంది.

పరీక్షలయిపోయాయి. పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థులకు ఉపాధ్యాయులకు వేసవి శెలవులిచ్చేశారు. ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు. ఇదే అదనుగా డైరెక్టరు ఎంక్వైరీ కమిషన్‌ని ఏర్పాటుచేశారు. ఎంక్వైరీ ఎలా, ఎప్పుడు, ఎక్కడ జరిగిందో ఎవరికీ తెలియదు. ఒకరోజు నోటీసు బోర్డులో నోట్ ఉంది. "ప్రొఫెసరు శేషాచలం కేసు ఎంక్వైరీ జరుగుచున్నది కాబట్టి ఆసక్తి కలవారు వారి స్వంత ఖర్చుతో వచ్చి తమకు తెల్సినదేదో కమీషన్ సభ్యులకి చెప్పాలి." ఈ నోటీసు చూసి రిసెర్చి విద్యార్థులు కొందరు "అన్యాయం" అనుకున్నారు. కాని ఏం చెయ్యగలరు ? శెలవులయ్యేసరికి శేషాచలం

# గురు సాక్షాత్ పరబ్రహ్మః?

సస్పెన్షన్‌లో ఉన్న పీరియడ్‌కి జీతంతోసహా రీఇన్‌స్టేట్ చెయ్యబడ్డాడు. ఎవరూ వచ్చి ఎంక్వైరీ కమిషన్‌వారికి ఏం చెప్పని కారణంగా కేసు కొట్టివేయబడింది. క్రిందటేడు విద్యార్థులలో సగంమంది (యమ్. యస్ సి. ఫైనల్‌లో ఉన్నవాళ్ళు) సగంమందే మిగిలారు. మిగిలిన సగం కొత్తవాళ్ళు ఎప్పుడో నాలుగు నెలల క్రిందట జరిగిన సంఘటనలో వీళ్ళందర్నీ ఉత్తేజితుల్ని చేసి మళ్ళీ సమ్మె చేయటం అసాధ్యం చేసే ఆసక్తి ఎవరికీ లేదు. డైరెక్టరుని ఇదేమని అడిగే దమ్ములు ఎవరికీ లేకపోయాయి.

ఒకరోజు ప్రమీలకి శైలజ నుంచి ఉత్తరం వచ్చింది. అందులోని వార్త ప్రమీలను అమితమైన ఆవేదనకు, ఆగ్రహానికి గురి చేసింది. మూర్తిని రెండు రోజుల క్రిందట ఎవరో గుండాలు కొట్టారట. తలకి, కాలుకి బాగా దెబ్బలు తగిలాయట. కాలు యంప్యుటేట్ చెయ్యబడిందట. తనకి వ్యతిరేకంగా బలమైన సాక్ష్యం ఇచ్చినందుకు శేషాచలమే కొట్టించాడని మూర్తి గట్టి నమ్మకం, ఇన్‌స్టిట్యూట్‌లో పుకారు.

ప్రమీల వెంటనే బయలుదేరింది. తల్లి తండ్రులతో హాస్టల్ రూమ్ ఖాళీ చేసేసి, సామాను తెస్తానని, కాషన్ డిపాజిట్ డబ్బు తీసుకొస్తానని చెప్పింది. ఇది ఎప్పటికైనా జరగవల్సిన పనే కనుక తండ్రిఅయిష్టంగానైనా ఒప్పుకున్నాడు.తమ్ముడు ప్రమీల వెంట వెళ్ళాలనుకున్నాడు కాని శెలవు దొరకలేదు.

సరాసరి డిస్పెన్సరీకి వెళ్ళింది ప్రమీల. మూర్తిని ఆ దయనీయమైన స్థితిలో చూడగానే మొట్టమొదటిసారిగా తను చేసిన పనికి పశ్చాత్తాప పడింది. అతని ప్రక్కన మూర్తి తల్లి కూర్చుని ఉంది. ప్రమీల ఎవరో తెలియగానే ఆవిడ ముఖం మాడిపోయింది. "ఇదంతా నువ్వు కట్టుకున్న పుణ్యమే కదా తల్లీ !" మూర్తికి ఆమెను గట్టిగా వారించే శక్తికూడా లేదు.

ప్రమీల రూమ్‌కి వెళ్ళిపోయి దీర్ఘాలోచనలో పడింది. సామాను సర్దుకునే ప్రయత్నం ఏం చెయ్యలేదు. మర్నాటి నుంచీ రోజూ మధ్యాహ్నం పూట ఒక అరగంట లాబ్‌కి వెళ్ళేది. శేషాచలం భోజనం తెమ్మని ఎవరికో ఒకరికి పురమాయించి ఆ అరగంట ఎవరితోనైనా హస్కువేయడానికి వెళ్తాడు. ఆ సమయంలో వెళ్ళేది ప్రమీల. భోజనం తెచ్చిన విద్యార్థి దాన్ని బల్లమీదుంచేసి ఇంకో ప్లేటుకప్పి వెళ్ళిపోతాడు. శేషాచలం భోజనానికి వచ్చేసమయానికి వెళ్ళిపోయేది. ఇలా మూడురోజులు. తర్వాత మూడు రోజులు రూమ్ నుంచి కదల్లేదు.

ఏడవరోజు ఆదివారం. శేషాచలం ఆదివారాలు కూడా లాబ్‌కి వెళ్తాడు. ఆ రోజు ప్రశాంతంగా ఉంటుందని లాబ్‌లో కూర్చుని రీప్రింట్లు, తన రిసెర్చికి సంబంధించినవి, చదువుకుంటుంటాడు. ప్రమీల ఆ సమయంలో లాబ్‌కెకెళ్ళి అతని ముందున్న కుర్చీలో కూర్చుంది. శేషాచలం ముందు ఆశ్చర్యపోయాడు. తర్వాత గర్వంగా నవ్వాడు.

ప్రమీల అతడ్ని పురుగుని చూసినట్టు చూసింది.

"ఎందుకొచ్చేవు ?" శేషాచలం చేతిలో పేపర్లు టేబిల్‌మీద పెడ్తూ అడిగేడు.

"నీలో పిశాచ లక్షణాలు ఏమైనా కన్పిస్తున్నాయేమో చూడ్డానికి. కాని నువ్వే ముసలి పిశాచంలా కన్పిస్తున్నావు. నిన్ను చూస్తుంటే నీకు నేను విధించిన శిక్ష చాలదనిపిస్తోంది" ఆశ్చర్యంగా చూశాడు. ప్రమీల కంటిన్యూ చేసింది.

"ఎన్నో ఆశలతో ఇక్కడికి వచ్చాను. సైన్సులో ఉన్న అవార్డులన్నీ పొందుదామనీ, నోబెల్ బహుమతి గ్రహీత నవ్వాలనీ, ఇంకా ఏమిటేమిటో ! అన్నీ నీ మూలంగా మొగ్గలోనే మాడిపోయాయి. నీ మూలంగా నా కుటుంబానికి దూరమయ్యాను. అది చాలదన్నట్లు మూర్తి జీవితాన్ని నాశనం చేసేవు. నీవు చాలాకాలం బ్రతికితే ఇంకా ఎందర్నిలా సర్వనాశనం చేస్తావో ? నీలాటి వాళ్ళకు సహజమైన చావు కూడా త్వరగా రాదు. పాపీ చిరాయువు కదా? అందుకని నేనేం చేశానో తెలుసా ?"

శేషాచలం ముఖంలో భయం చోటు చేసుకుంటోంది. అది చూసి ప్రమీలకి పరమానందంగా వుంది. రెండు నిమిషాలు వినోదంగా అతన్ని చూస్తూ కూర్చుని మళ్ళీ మొదలెట్టింది. "నిన్ను ఒక్కక్షణంలో చంపాలనుకున్నాను. అలా అయితే అదృష్టవంతుడివయిపోతావు. నీ చావు రోజురోజుకి దగ్గర కొస్తోందని నీకు తెలియాలి. అంతుబట్టని రోగాలతో కుళ్ళి కృశించి చావాలి. నిన్ను బాధించే ఒక్కోరోగమూ నీ ఒక్కోపాపాన్ని గుర్తుచెయ్యాలి. నాలుగురోజుల క్రిందట నీ కోసం ఎదురుచూస్తున్న నీ భోజనంలో దిట్టంగా "ఆర్సెనిక్" కాంపౌండు కలిపాను. అది స్లో పాయిజన్. అని నీకు తెలిసే వుంటుంది. ఈపాటికి బాగా జీర్ణమయి నీ అణువణువుకి సరఫరా చేయబడి వుంటుంది. ఇంకో సంవత్సరంలో నువ్వు గ్యారంటీగా చస్తావు. ఈలోపుగా వచ్చే రోగాల్ని నువ్వు ఎంత డబ్బు వెదజల్లినా, ఎంతమంది డాక్టర్ల దగ్గరకెళ్ళినా నయం చెయ్యలేరు. పోలీసు రిపోర్టిస్తానంటావో మహ చక్కగా ఇవ్వు. దీనికి సాక్ష్యం లాబ్‌లో వున్న బల్లలు, సీసాలు, గాజుసామాగ్రి. అసలు ఆ కేసు మొదలయ్యేసరికి నువ్వుండవు."

ప్రమీల అతడిని చూస్తూ క్రూరంగా బిగ్గరగ నవ్వింది. అతని ముఖం భయంతో నల్లబడింది. అప్పుడే తన శరీరమంతా విషజ్వాలలు రేగుతున్నట్లనిపించి గజగజలాడిపోసాగాడు. ప్రమీల మరోసారి నవ్వి రూమ్‌కి వెళ్ళిపోయింది మంచంమీదపడి ఎంతోసేపు ఏడ్చింది.

శైలజకి ఎలా ఓదార్చాలోకూడా తెలియలేదు. చివరికి చిన్న సూట్‌కేసులో కొన్ని చీరెలు సర్దుకుని శైలజకి వీడ్కోలు వాక్యాలు చెప్పింది.

"మిగిలిన సామానంతా ఎప్పుడు తీసుకెళ్తావు ?" విస్తూబోతూ అడిగింది శైలజ.

"అదంతా ఎవరికైనా ఇచ్చెయ్యి శైలూ ! నేను ఎక్కడికి వెళ్తున్నానో నాకే తెలియదు. ఇంటికి మాత్రం కాదు. అక్కడ బ్రతకలేకపోతున్నానే ! బహుశ ఏదైన మారుమూల పల్లెకు పోయి ఏ ఆధారం దొరక్కపోతే కూలి చేసుకు బ్రతుకుతాను. నేను చదువుకున్నాననే సంగతి మరిచిపోతున్నాను"

తెలియని గమ్యం వెతుక్కుంటూ అనాథలా వెళ్ళిపోతున్న ఆ అభాగినిని చూస్తుంటే శైలజ కళ్ళవెంట నీళ్ళు జల జల రాలిపోతున్నాయి. ★

# ఊహాల ఉయ్యాల - 5

రంగుల బొమ్మల కథ






















[ఇంకా ఉంది]



'పెళ్ళిళ్ల పేరయ్య'లో చంద్రమోహన్, జ్యోతిలక్ష్మి, నారాయణరావు

## సినిమా

—జి.వి.జి.

### ప్రేమమూర్తులులో త్రిమూర్తులు

(గావు) గోపాలరావు దినపత్రిక తిరగేస్తూంటే అటుపక్కనుంచి అత్త (అల్లు) చదివేస్తున్నాడు 'కుతుబ్‌మినార్‌లో పవర్ కారణంగా తొక్కిసలాటలో నలభై అయిదుమంది మృతి కిరసనాయిలు క్యూలో కుమ్ములాట ముగ్గురి కాళ్ళు విరుగుట ''

గోపాలరావుకు చిర్రెత్తుకొచ్చింది "ఒక పక్క నేను పేపరు చదువుతున్నాను నువ్వంత గట్టిగా రొద పెట్టేస్తూంటే, నాకేమన్నా బోధపడాలా ?"

"ఒకపక్క మీరు చదువుతున్నారు. ఒకపక్క నే చదువుతున్నాను రెండూ మీరు వింటూ ఉంటే, ఒకేసారి పేపర్ ఫినిష్ అయిపోతుంది గదండీ ?"

"పేపరే కాదు, నీవల్ల తొందరలో నేను ఫినిష్ అయిపోయేటట్టున్నాను."

ఇంతలో రామదాసు (నూతన్ ప్రసాద్) "సార్, సార్!" అంటూ అమాంతంగా ఊడిపడ్డాడు. "సార్! నేను చెబుతున్నాను అని మీరు అనుకోకపోతే, మీకొక మాట చెబుతాను, సార్! మీరు నన్ను కంపెనీలోంచి తీసేసిన తర్వాత ఊళ్ళమ్మట తిరిగాను. ఎంత వెదకినా మీలాంటి మహానుభావుడు కనబడలేదు, సార్— ఉద్యోగం చేద్దామంటే. దాంతో జీవితంమీద విరక్తి పుట్టి బైరాగుల్లో కలిసిపోదామనుకున్నాను. ప్రస్తుతానికి వాళ్ళా వేకెన్సీలేదు పొమ్మన్నారు ఇక గత్యంతరం లేక చచ్చిపోదామనుకున్నాను యమధర్మరాజుగారు నా ఎకౌంట్ ఇంకా క్లోజ్ చెయ్యలేదుట అందుకే ఇలా వచ్చాను, సార్!"

"ఏయ్, ఉద్యోగం ఇవ్వకపోతే ఏం చేస్తావ్?" అని తీవిగా అడిగాడు అత్త

'ఏం చేస్తామా, మిమ్మల్ని మర్డర్ చేసి జైలుకి పోతాను అక్కడ నాకు ఫ్రీగా ఫుడ్ పెడ్తారు.' అని రామదాసు అనేసరికి అత్త గాభరాతో గోపాలరావు దగ్గరికి జరిగాడు

శోభన్‌బాబు, మురళీమోహన్, లక్ష్మి, రాధ ప్రధాన భూమికలు నిర్వహించిన శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి "ప్రేమమూర్తులు" చిత్రం అతి త్వరలో విడుదల ఎ కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మిద్దే రామారావు నిర్మాత

'భక్త ధ్రువ మార్కండేయ'లో రోహిణి



'గోపాలకృష్ణుడు'లో జయసుధ



## శ్రీరాం ఫిలిమ్స్ షూటింగ్ ప్రారంభం

"ఫామిలీ సెంటిమెంట్‌తోపాటు క్రైమ్, సస్పెన్స్ మిళితమైన కథ," అన్నారు దర్శక నిర్మాత, ఛాయాగ్రాహకుడు జానకిరాం ఈయన మార్చి 24 న ప్రారంభించిన శ్రీరాం ఫిలిమ్స్‌వారి 7వ చిత్రంలో మురళీమోహన్, ప్రభాకరరెడ్డి, మోహన్, సారథి, పుష్పలత, జయశ్రీ, ద్విపాత్రలలో గీత నటిస్తున్నారు మాటలు, పాటలు గోపీ రాశారు రమేష్‌నాయుడు సంగీతం, ■ ఎస్. కృష్ణ శిల్పం, సతీబాబు సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు. తొలి షెడ్యూల్ ఏప్రిల్ 1 వరకు ప్రసాద్ స్టూడియోలో, రెండవ షెడ్యూల్ ఏప్రిల్ 2 నుంచి 10 వరకు ఔట్‌డోర్‌లో జరిగాయి చివరి షెడ్యూల్ ఏప్రిల్ 20 నుంచి మే 5 వరకు జరుగుతుంది

## వెంకటేశ్వర ఆర్ట్స్ తొలి చిత్రం

'ప్రఖ్యాత నవలా రచయిత్రి డాక్టర్ సి ఆనందారామం కథతోపాటు తొలిసారిగా సంభాషణలు మా చిత్రానికి రాశారు," అన్నారు పి ఎస్ బోస్ ఈయన లోగడ పి పుల్లయ్య, పి ఎస్ రావ్, స్వర్గీయ వేదాంతం రాఘవయ్యగార్ల వద్ద అసోసియేట్‌గా పనిచేశారు ఈయన దర్శకత్వంలో హైదరాబాద్ వాస్తవ్యులు పి వెంకటేశ్వర్లు, జి నాగేశ్వరరావు నిర్మించే తొలి చిత్రానికి మార్చి 29 న మొదటి పాట రికార్డ్ చేశారు సాయిచంద్, కవిత, కాంతారావు, ఝాన్సి, అత్తిలి లక్ష్మి వగైరా నటవర్గం సి నారాయణరెడ్డి గీతాలకు పెండ్యాల స్వరకర్త సి రామకృష్ణారావు ఛాయ, శ్రీనివాసరావు శిల్పం, సత్యం ప్రొడక్షన్ బాధ్యతలు వహిస్తున్నారు మే 1న చిత్రీకరణ మొదలవుతుంది

అక్కినేని నాగేశ్వరరావు





'వయ్యారిభామలు -వగలమారి భర్తలు'లో శ్రీదేవి, ఎన్ టి రామారావు

## కాగడా

"తను దహించుకుపోతూ, అన్యాయాన్ని దహించాలని పరుగులెత్తే ఉత్తర ప్రదేశ్‌లోని బందిపోటు ముఠా నాయిక పూలన్‌దేవి కథ ఆధారంగా తయారౌతోంది మా చిత్రం," అన్నారు గెద్దాడ ఆనంద బాబు ఈయన రచన, దర్శకత్వంలో అరిగెల సాంబశివరావు, కె ఎస్ రెడ్డి నిర్మించే విశ్వసారధీ మూవీస్ 'కాగడా' చిత్రంలో నాయిక నాయకులుగా లక్ష్మిరాణి, ఉదయరాజ్ పరిచయం గావింపబడుతున్నారు హేమసుందర్, సారథి, శివకుమార్, శశిమోహన్, జయభాస్కర్, మాధ్యారావు, వెంకటపతిరాజు, కృష్ణారెడ్డి, ప్రేమదాసు, శ్రీలక్ష్మి, మీనా, శ్రీలేఖ ఇతర పాత్రధారులు రాజశ్రీ, గోపి, విజయరత్నం గీతాలకు ఎ ఎ రాజ్ స్వరకల్పన చేశారు రఘునాథరెడ్డి ఛాయ, కె రామలింగేశ్వరరావు శిల్పం, రణధీర్ నృత్యాలు, సి హెచ్ సాధు నిర్వహణ, చక్రవర్తి సహదర్శకత్వం, ఎస్ రాజేంద్ర — పి వి రామారావు సహాయ దర్శకత్వంలో దాట్ల సీతారామరాజు సమర్పిస్తారీ చిత్రాన్ని "ఏప్రిల్ మొదటి వారం నుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది" అన్నారు ప్రొడక్షన్ కంట్రోలర్ డాక్టర్ రాధాకృష్ణమూర్తి

## "మరో దేవదాసి"

ప్రప్రథమంగా వీడియో డబ్బింగ్‌తో బొంబాయిలో రీరికార్డింగ్ జరిగిన చిత్రభారతి క్రియేషన్స్ వారి సైచిత్రంలో కొత్త నటీనటులు పాల్గొన్నారు డి ఎస్ ఆర్ ఎ వి ప్రసాద్ నిర్మించిన ఈ చిత్రానికి పూనా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ మాజీ అధ్యాపకుడు వేములపల్లి రాధాకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వంతోపాటు వీడియో డబ్బింగ్ నిర్వహించారు రామచంద్ర ఛాయ, కమలాకర్ కూర్పు, కోటేశ్వరరావు వీడియో రికార్డింగ్‌తో రమేష్ నిర్వహణ బాధ్యతలు వహించారు

[ 36వ పేజీ చూడండి ]

జగన్నాథ రథచక్రాలు'లో జయప్రద



# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## విద్యార్థిలోకం వ్యాసరచన పోటీ!

## మొత్తం బహుమతులు రు. 6000 !

మొదటి బహుమతి రు. 1000

రెండవ బహుమతి రు. 750

మూడవ బహుమతి రు. 500

గడువు తేదీ

**31-5-1982**

ఇవికాక రు. 150 చొప్పున 25 ప్రత్యేక బహుమతులు!

## మా విద్యార్థి లోకం ఆశయాలు

ప్రపంచం అన్ని విధాలుగానూ మారిపోతున్న ఈ కాలంలో విద్యార్థి లోకం సమస్యలు ఇన్నీ అన్నీ కావు! వారి ఆశయాలకి యదార్థాలకి కుదరటం కష్టం అయిపోతోందని అందరూ అంగీకరిస్తున్నారు.

తమ సమస్యలని గురించి చెప్పే హక్కు విద్యార్థినులకి, విద్యార్థులకి కాక ఇంకెవరికి ఉంటుంది? అసలు విద్యార్థి లోకం సమస్యలు ఇతరుల సమస్యలే అంటే కూడా అతిశయోక్తి కాకపోవచ్చు!

అందుకనే విద్యార్థినులూ, విద్యార్థులూ తమ ఆశయాలనీ, ఆ ఆశయాలకి అవరోధాలుగా నిలిచే సమస్యలనీ, ఆ సమస్యల పరిష్కారానికి తగిన మార్గాలనీ గురించి సాభిప్రాయంగా రాసేందుకు అవకాశాలు కల్పించాలనే ఉద్దేశంతో ఆంధ్రసచిత్రవారపత్రికలో ఒక విద్యార్థి లోకం వ్యాస రచన పోటీ ఏర్పాటు చేస్తున్నాము!

ఈ వ్యాస రచన పోటీ ఒక మంచి చర్చావేదికగా రూపొంది విద్యార్థి లోకంలోనూ, ఇతరులలోనూ ఆలోచనలని రేకెత్తించగలిగేట్లుగా ఉండగలదని ఆశిస్తున్నాము!

విద్యార్థినులూ, విద్యార్థులూ ఈ వ్యాస రచన పోటీలో ఉత్సాహంతో పాలుగొని దానిని జయప్రదం చెయ్యాలని మా కోరిక!

## నిబంధనలు:

1. ఈ వ్యాస రచన పోటీలో విద్యార్థినులూ, విద్యార్థులూ మాత్రమే పాల్గొనవచ్చు. ఇతరులు పాల్గొనరాదు.
2. వ్యాసాలు రెండు అరఠావు పేజీలని మించి ఉండరాదు. ఒక అరఠావు పేజీ రెండు ఎక్సర్సయిజు నోట్ బుక్ పేజీలతో సమానం.
3. రచన కాగితానికి ఒక పక్కనే పూర్తిగా తెలుగు లిపిలో రాసినదయి ఉండాలి.
4. ప్రతి వ్రాతప్రతిమీదా రాసినవారి పేరూ, పూర్తి చిరునామా కూడా రాసి ఉండాలి. వేరే చీటీలమీద పేరూ, చిరునామా రాసి వాటిని వ్రాత ప్రతులతో జతపరచరాదు.
5. రచన పెట్టిపంపే కవరుమీద "విద్యార్థి లోకం వ్యాస రచన పోటీకి" అని స్పష్టంగా రాసి ఉండాలి.
6. వ్యాసాలు పంపవలసిన పేరు, చిరునామా :

సంపాదకుడు,
ఆంధ్రసచిత్ర వారపత్రిక
శ్రీ దుర్గా విలాస్
గాంధీనగర్
విజయవాడ – 520 003.

వ్యక్తుల పేర పంపరాదు.

7. వ్రాత ప్రతులు ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పిపంపబడవు. రచయిత(త్రు)లు స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజీకల కవరులుకాని తపాలా బిళ్లలుకాని జతపరచరాదని మనవి.
8. ప్రతి వ్యాసంతోనూ ఈ ప్రకటనలో పొందుపరిచిన 'కూపన్' జతపరచాలి. కూపన్ జతపరచబడని రచనలు పోటీకి పరిశీలించబడవు.
9. వ్యాసాలు మా కార్యాలయానికి 31–5–82 నాడుగాని, అంతకు ముందుగాని అందాలి. ఆ తరువాత అందినవి పోటీకి పరిశీలించబడవు.
10. పోటీ ఫలితాలు జూలై (నెల)లో ప్రచురించటానికి ప్రయత్నిస్తాము.
11. పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే. దీని విషయములో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
12. ప్రతి వ్రాతప్రతిమీద రచయిత (త్రి) రచన తమ స్వంతమేనని తెలిపే హామీ ఇవ్వాలి.
13. వీలువెంబట్టి పోటీలో గెలిచిన వ్యాసాలని ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురిస్తాము.

### కూపన్

పేరు ................................................

వయస్సు .................... తరగతి ....................

ఇంటి నెం. .................... వీధి ....................

పేట .................... ఊరు ....................

పిన్ కోడ్ ....................



'జస్టిస్ చౌదరి'లో ఎన్. టి. రామారావు

# సినిమా

[33 వ పేజీ తరువాయి]

## "సంతోషిమాత వ్రతమహాత్మ్యం"

"సంతోషానికి ప్రతిరూపం సంతోషిమాత ఈ మహాతల్లి అవతారానికి ఓ విశిష్టత ఉంది. ఈమెను స్మరిస్తే, సంతోషం సిద్ధిస్తుంది. ఈమె గణపతి, సిద్ధిలకు ఉదయించిన పుత్రిక. ఈమె వ్రతాన్ని శుక్రవారాలనాడు ఆచరిస్తారు. ఆ రోజు ఆవేశ కావేషాలకు లోనయ్యే పులుపు కారాలను విసర్జిస్తారు. ఈ మాతకు దక్షిణ కాశీ అని పిలువబడే ధర్మపురిలో ఆలయం నిర్మించిన కె. రాజయ్య అనే వణిక ప్రముఖుడు ఈమె మహాత్మ్యాలను తెలియజేయాలనే పవిత్రమైన లక్ష్యంతో ఈ చిత్ర నిర్మాణానికి ఉపక్రమించారు. ఇందులో వచ్చిన లాభాలతో ఒక నిధిని ఏర్పాటుచేసి ప్రజాహిత కార్యాలకు వినియోగిస్తారు. లోగడ హిందీలో ఇలాంటి చిత్రమొకటొచ్చింది. కాని, దానికీ—దీనికీ ఎక్కడా పోలిక లేదు. ఇది పూర్తి తెలుగుదనం గల చిత్రం," అన్నారు డైరెక్టర్ కమలాకర కామేశ్వరరావు. మార్చి 17న పాటల రికార్డింగ్‌తో ఈ చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది. సంతోషిమాతగా కె.ఆర్. విజయ నటిస్తుంది. రాజనర్తకిగా రాధాప్రసాదరావ్ అనే విద్యార్థికుమారి పాల్గొంటుంది. చంద్రమోహన్, శ్రీధర్, సత్యనారాయణ, రాజా, భీమేశ్వరరావు, శివకుమార్, వీరభద్రరావు, ఏమూరి. పొట్టి ప్రసాద్ ఇతర ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. భారవి రచయిత. కె. వి. మహదేవన్ సంగీతం, యోగానంద్ ఛాయ, వాలి శిల్పం, నాగేశ్వరరావు కూర్పు, తాండవకృష్ణ నిర్వహణ, విజయారావు సహదర్శకత్వంతో కె. విజయలక్ష్మి ఈ చిత్రాన్ని సమర్పిస్తారు. జయలక్ష్మి ఆర్ట్ ఇంటర్నేషనల్ పతాకంలో నిర్మాణం.

## "లంకె బిందెలు"

'ఆగస్ట్‌నుండి షూటింగ్,' అన్నారు యువ విరల్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి దర్శకత్వం వహించే విజయనిర్మల. కృష్ణ, శ్రీదేవి, సత్యనారాయణ, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, గుమ్మడి, అల్లు రామలింగయ్య, కవిత, రూప్, నిర్మల వగైరా తారా సందోహం. డి. వి. నరసరాజు సంభాషణలు, రాజన్–నాగేంద్ర సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయలో ఎం. బాలకృష్ణ నిర్మాత

నవరస నాయకుడు 'నటరత్న' యన్.టి.ఆర్ నటనా వైభవం!

దాసరి నారాయణరావు

వడ్డే శోభనాద్రి సమర్పించు

విజయ మాధవీ కంబైన్స్

# బొబ్బిలిపులి

సినిమా స్కోప్

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: వడ్డే రమేష్ నిర్వహణ: వడ్డే కిషోర్

నైజాం- శ్రీ తారకరామ (ద్వారా) శ్రీ సాయికృష్ణ, సీడెడ్ స్వర్ణయుగ మూవీస్, గుంటూరు-నెల్లూరు కళ్యాణి ఫిలింస్

అన్నపూర్ణా ఫిలింస్

## సినిమా

## రాగం — తానం — పల్లవిలో రావు త్రయానికి రసభంగం

"నవ్విందిరోయ్! ఆ అమ్మాయి నన్ను చూసి నవ్విందిరా!" అన్నాడు పాపారావు(ఎం.ఎస్.ప్రసాద్) కుప్పిగంతులు వేస్తూ.

"నిన్ను చూసి కాదురా, ఫూల్! అందర్లోకీ అందగాడ్నయిన నన్ను చూసి నవ్వింది రా!" తాతారావు (హరిప్రసాద్) కాలర్ సర్దుకున్నాడు.

రంగారావు (చంద్రమోహన్)కి చిర్రెత్తుకొచ్చింది. "రేయ్! ఆగండి — ఆగండి! ఇక్కడ నేనంటూ ఒక సూపర్ స్టార్‌ని ఉన్నాననే మాట తెలిసీ కూడా ఆ అమ్మాయి మిమ్మల్ని చూసి నవ్విందనుకోవడం మీ శుద్ధ పొరపాటురా. ఆ అమ్మాయి నన్ను చూసి నవ్విందిరా!"

"నిన్ను చూసి కాదురా!" అని పాపారావు అంటే, "నిన్ను మాత్రం చూసి కాదురా!" అని తాతారావు గొడవ పడసాగారు.

"రేయ్! రేయ్!" రంగారావు దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ, "మనలో మనకు గొడవెందుకురా? ఆ అమ్మాయి ఎవరిని చూసి నవ్విందో తెలుసుకుంటే పోలా? అడుగుదామా?" అన్నాడు.

"ఓ—కే — ఓకే!" అన్నారు పాపారావు, తాతారావు.

"కాని, ఓ కండిషన్‌రా. ఆ అమ్మాయి ఎవర్ని చూసి నవ్విందో తెలిశాక — మిగిలిన ఇద్దరికీ సిస్టర్ అవుతుంది," అని రంగారావు పెట్టిన షరతుకి మిత్రులు "డబుల్ ఓకే!" అన్నారు.

రంగారావు ఎలాగో ధైర్యం తెచ్చుకుని, ఆ కన్నెల వినువక్రమ సమీపించి, "మీరు మాలో ఎవరిని చూసి నవ్వారండీ?" అని అడిగేశాడు.

అందుకు ఆమె ఇచ్చిన సమాధానం: "మనిషికి వంద."

దాంతో ముగ్గురు రావులూ అమాంతంగా కొయ్యబారిపోయారు.

తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో చింతపల్లి ప్రసాద్ సమర్పించే రాం శ్యాం ఆర్ట్ క్రియేషన్స్ "రాగం — తానం — పల్లవి" చిత్రానికి డాక్టర్ టి కె ఎం ఛటర్జీ నిర్మాత.



"అయితే మను సినిమాలు మానేసి రాజకీయాల్లో చేరుతున్నామన్నమాట!"

'ప్రేమ మూర్తులు' లో శోభన్ బాబు, రాధ



'ప్రేమ నక్షత్రం'లో కృష్ణ, శ్రీదేవి

## సినిమా

### "సెన్సార్ ట్రబుల్"

ఇటీవల చిత్ర పరిశ్రమలో 'సెన్సార్ ట్రబుల్' అనే మాట తరచు వినిపిస్తోంది సెన్సార్ ధ్వంద విధానానికి, సర్టిఫికేట్లు ఇవ్వడంలో చేసే జాప్యానికి పలు నిర్మాతలు గగ్గోలు పెట్టేస్తున్నారు "చిత్రం చూశాంగనుక విధిగా ఏవో కొన్ని కత్తిరింపులు పెట్టక తప్పదు—అనే ధోరణిలో కొందరు సెన్సార్ సభ్యులు వ్యవహరిస్తున్నట్లుంది చలనచిత్ర నిర్మాణం గురించి ఏమాత్రం తెలియని సభ్యులవల్ల ఇలాంటి అవకతవకలు జరుగుతున్నాయి," అన్నారు ప్రతాప్ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఇంట్లో రామయ్య—వీధిలో కృష్ణయ్య" చిత్ర నిర్మాత కె రాఘవ "ఏ శబ్దమైనా ఈ సభ్యులకు రెండర్థాలుగా స్ఫురిస్తే కట్! పిడికెడు మెతుకులకోసం పోరాడడం—వీరి దృష్టిలో హింస సర్వ ఎమానత్వానికి పాటుపడడం—దారుణం! ఒక భాషలో సెన్సారై విడుదలైన చిత్రాన్ని మరో భాషలోకి డబ్ చేస్తే, అందులో మళ్ళీ కొత్తగా కొన్ని కట్స్!" అని విట్టూర్పు విడిచాడు మరో నిర్మాత

కాలం మారుతోంది తరాలు మారుతున్నాయి ప్రజల్లో ప్రగతి కండూతి పెరుగుతోంది కాని, దారిద్ర్య నిర్మూలనకు అన్ని రంగాలలో సమానత్వ సాధనను ప్రబోధిస్తూ, నగటు మనిషికి సాంఘిక

'ఇంట్లో రామయ్య — వీధిలో కృష్ణయ్య'లో సంగీత, గొల్లపూడి మారుతీరావు



న్యాయం జరగాలని ఏమాత్రం చైతన్యం కలిగించే సంఘటనలు కనిపించినా కత్తెరకు గురి అవుతున్నాయని ప్రజాశ్రేయంకోసం ప్రజా చిత్రాలు తీసే అభ్యుదయగాములు తీవ్రనిరసనను తెలియజేస్తున్నారు

నిర్మాతకు సాంఘిక బాధ్యత అంతో ఇంతో ఉంది శక్తివంతమైన సినిమా మీడియంవల్ల సాంఘిక చైతన్యం రావడానికి వీలుంది అమాయకపు ప్రజానీకానికి కనువిప్పు కలిగించే రీతిలో — పదవులకోసం, దోపిడీ వ్యవస్థ దేశంలో జరిపే అన్యాయాలకూ— ప్రగతి కాముకులకూ మధ్య నడిచే చిత్రకథలకు సెన్సార్‌వారు అభ్యంతరాలు తెలిపితే, చైతన్యవంతమైన చిత్రాలు ఎలా వస్తాయని మరో నిర్మాత ప్రశ్న సమాజాభివృద్ధిని కాంక్షించే మాధాల రంగారావు తీసిన "విప్లవశంఖం" చిత్రానికి సెన్సార్ సర్టిఫికేట్ ఇవ్వడంలో జరిగిన తాత్సారానికి నిరసనగా రంగారావు మార్చి 15న ప్రాంతీయ సెన్సార్ కార్యాలయం ముందు భావ స్వాతంత్ర్యంకోసం, సామాజిక న్యాయం కోసం నిరాహారదీక్ష పూనినరోజు విశ్వ చలనచిత్ర చరిత్రలో రుధిరాక్షరాలలో లిఖించదగినది. కొన్ని లాంఛనాలు పూర్తయ్యాక క్లియరెన్స్ సర్టిఫికేట్ ఇవ్వబడ తుందని ప్రాంతీయ సెన్సార్‌బోర్డ్ ఆఫీసరు హామీ ఇవ్వగా మాదాల నిరాహారదీక్షను విరమించడంతో పరిస్థితి ఓ కొలిక్కి వచ్చిందేగాని, లేకపోతే దేశవ్యాప్తంగా పరిస్థితి మరింత ఉద్రిక్తమయ్యేదేమో! అంచేత మాదాల ఏకాకిగా సాధించిన విజయం పరిశ్రమ విజయంగా పరిశ్రమలోని పలువురు హర్షాన్ని వెలిబుచ్చారు

"జయమాలిని" డబ్బింగ్ చిత్రం విషయం నర్తకి ఒంపుసొంపులే ప్రధాన ఆకర్షణగా కాకుండా పల్లెటూరులో నృత్యాలు చేసి పొట్టపోసుకునే బుచ్చమ్మ నాగరీకుల మాయోపాయంలోపడి, పట్నం వెళ్ళి క్లబ్ డాన్సర్‌గా, పాప్ సింగర్‌గా మారి, చివరికి అన్యాయాలకు బలి అవుతుందనే ఉదాత్తమైన కథతో తమిళంలో "స్వర్గత్తిన్ తిరప్పువిళా"గా తయారై పది నెలలుగా తమిళనాడు, కర్నాటక, కేరళ రాష్ట్రాలలో ప్రదర్శింపబడుతోంది ఆ చిత్రాన్ని మాన్ కంబైన్స్‌వారు తెలుగులో "జయమాలిని" పేరతో ఎలాంటి చేర్పులూ, మార్పులూ లేకుండా డబ్ చేస్తే, విపరీతమైన సెన్సార్ కత్తిరింపులకు గురైంది. ఎంతో ఆవేదనతో ఆ చిత్ర నిర్మాత పి ఆర్ అన్నామలై "తెలుగులోకి ఉన్నదున్నట్లు కుదించి డబ్ చేసిన మా చిత్రం సెన్సార్‌వారి అభ్యంతరాలకు గురైంది ఇదివరకు డబ్బింగ్ చిత్రాలకు సంభాషణల పరమైన సెన్సార్ మాత్రమే ఉండేది కాని, ఇటీవల దృశ్యపరమైన సెన్సార్ విధానాన్ని ప్రవేశపెట్టారు ఐతే, ఈ విధానం అమలులోకి రాకముందే 'స్క్రిప్ట్'ను సెన్సార్‌కు పంపి, ఆమోదం పొందాం ఐనా, ఎగ్జామినేషన్ కమిటీవారు 21 'కట్స్' ఇచ్చారు రివైజింగ్ కమిటీకి వెళ్తే, వాళ్ళు 72 'కట్స్' ఇచ్చారు ఒకసారి సెన్సారైన చిత్రానికి ఈ విధంగా 'కట్స్' సూచించడానికి ఎలాంటి రూల్సూ లేవు అంచేత, అన్యాయమైన ఈ సెన్సార్ విధానంమీద అవసరమైతే న్యాయస్థానానికి కూడా వెళ్ళదలచుకున్నాను," అన్నారు.

## శ్రీనాథ్ మూవీస్ తొలి చిత్రంలో పోలీసాఫీసర్ — పొలిటీషియన్ల సంవాదం

పోలీస్ కమీషనర్ కమలనాథ్ (శోభన్‌బాబు) గది. హడావిడిగా అలెగ్జాండర్ (రావు గోపాలరావు) వచ్చి కూర్చోబోతూన్న కుర్చీని కమలనాథ్ కాలితో దూరంగా తోసేశాడు. "ఖూనీకోర్లకు కుర్చీ ఆఫర్ చెయ్యటానికిది - నువ్వు నడిపిస్తూన్న ఫైవ్ స్టార్ హోటల్ కాదు, నాగరాజూ... పోలీస్ స్టేషన్!" అంటూ గర్జించాడు.

తుళ్ళిపడ్డ అలెగ్జాండర్ వెంటనే తమాయించు కుంటూ, "నా పేరు నాగరాజు కాదు, కమీషనర్... అలెగ్జాండర్!" అన్నాడు.

"తెల్లరంగు వేసుకున్నంత మాత్రాన కాకిని చూసి హంసని మోసపోడు ఈ కమలనాథ్. నేను గుంటూరులో ఎస్. ఐ. గా ఉన్నప్పుడు నువ్వు ఖూనీ కేసులో పట్టుబడడం, నా మెడమీద కత్తితో పొడిచి పారిపోవటం... ఏం? గుర్తొచ్చిందా నీ మొదటి అవతారం?"

"మీరు చెప్తున్న లెక్చరేటో ఏనాడు సినిమా లోని కతలాగ నా కర్థమవటంలేదు."

"అర్థం అయ్యేటట్టు చెప్పమంటావురా?"

"రా! ఏవండోయ్! ఓల్ ఆంధ్రా మొత్తం మీద ఒకటోరకం పెద్దమనిషిని. ఒరేయ్, అరేయ్ — అంటే టూపు లేచిపోద్ది మరి."

"షటప్! లంచాలిచ్చి దండాలు పెట్టించు కున్నంత మాత్రాన ఓ ఫుండాకోర్ రాస్కెల్ పెద్దమనిషవడు, నాగరాజూ!"

"ఎందుకవడు, కమీషనర్? ఇది పెజా ప్రభుత్వాం. ఛీ — అనిపించుకున్నోడు సీమంతుడై పోతున్నాడు. పో — అనిపించుకున్నోడు పొలిటికల్ లీడరై పోతున్నాడు — తెలుసా? అంతెందుకండీ,.. ఇనస్పెక్టర్లు ముదిరిపోయి కమీషనర్లై పోగాలేంది — నేను పెద్దమనిషిగా మారటంలో ఆశ్చర్యమేముం టుంది? మీరు కుర్చీ తన్నేసినంత మాత్రంచేత నా పొజీషన్ పడిపోలేదు. నా వేల్యుయేషన్ తగ్గిపోలేదు."

"అలా అయితే నిన్ను ట్వెంటీఫోర్ అవర్స్ రిమాండ్‌లో ఉంచుతున్నాను. నువ్వేం చెయ్యగలవో చెయ్ — నేనూ చూస్తాను."

"ఓహో! కాఫీ బట్టలం ఫవర్పేటో నువ్వు శాంపిల్ చూపిస్తే — మరో ట్వెంటీఫోర్ అవర్స్‌లో నిన్ను ఇంటికి పంపించే ఎరేంజిమెంట్లు నేనూ చెయ్యగలను... సెంట్రల్ లెవెల్ మనిషిని — ఒంటరిగా పట్టుకుని, నువ్వు క్రీస్తుపూర్వం ఓ ఖూనీకోరెదవ్వని గేపకం సేస్తే, మరో ఖూనీకోరెదవకి తిక్కరేగి — నీ పొజిషన్‌ని ఎలా చెడుగుడు ఆడించేసా డో, నిన్ను సీటు ఎలా దింపిం చేస్తాడో, నీ కుర్చీని ఎలా తన్నించేస్తాడో..."

"షటప్!" అంటూ కమలనాథ్ చాచి దవడ అదరకొట్టడంతో అలెగ్జాండర్ కళ్ళు బైర్లు కమ్మాయి.

గుత్తా రామినీడు దర్శకత్వంలో తుది మెరుగులు దిద్దుకుంటూన్న శ్రీనాథ్ మూవీస్ తొలి చిత్రానికి అలపాటి రంగారావు నిర్మాత.



'జగ్గు' లో జయసుధ, కృష్ణంరాజు

## గోల్కొండ అబ్బులు మే విడుదల

"షూటింగ్ పూర్తయిపోయింది. ఏప్రిల్‌లో డబ్బింగ్, రీరికార్డింగ్ ముగించి, మే నెలలో విడుదల చేస్తాం," అన్నారు నిర్మాత కుమార్జీ. "కటకటాల రుద్రయ్య, సీతారాములు" అనంతరం దాసరి, కృష్ణంరాజు కాంబినేషన్‌లో తయారైన లక్ష్మీదేవి పిక్చర్సువారి "గోల్కొండ అబ్బులు"లో జయప్రద, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, కాంతారావు, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, చలపతిరావు, శివరంజని పాల్గొన్నారు. కె. వి. మహాదేవన్, కె. ఎస్. మణి, భాస్కరరాజు, కోటగిరి గోపాలరావు, రమణబాబు, రాజేంద్రప్రసాద్ తెరవెనుక కృషి చేశారు. కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం : దాసరి నారాయణరావు. ★

## ఇరుగు - పొరుగు

★ "ఏక్ దుజే కే లియే" హిట్ అవడంతో ఎందరో హిందీ చిత్ర నిర్మాతలు పిక్చర్లు తీసిపెట్టమని స్వయంగానూ, మిత్రుల ద్వారానూ నన్ను కోరుతున్నారు. బాగానే ఉంది. అలాంటి హిట్ పిక్చర్ మరొకటి అందివ్వగలననే ఆశ వాళ్ళకుండడం సహజమే. వాళ్ళకు ఇదివరకు బాలచందర్ ఎవరో, ఎంత కాలంగా ఫీల్డులో ఉంటున్నాడో, తెలుగు — తమిళ భాషల్లో లోగడ ఎన్ని పిక్చర్లు తీశాడో తెలీదు. సరే .. వాళ్ళలో ఒకరికి ఒక చిత్రం తీసిపెడ్తాను. అది షుమారుగా పోయిందను కుందాం. అప్పుడిక వాళ్ళు ఏమనుకుంటారు? 'ఏక్ దుజే కే లియే' హిట్ అవడం ఫ్లూక్ అని... ఈ విషయాలెలాగుండనీ, 'ఆకలి రాజ్యం' హిందీ వెర్షన్‌కు ప్రముఖ హిందీ దర్శక రచయిత గుల్జార్ సంభాషణలు రాస్తున్నారు. ఇది నేను గర్వించాల్సిన విషయం. 'ఆకలి రాజ్యం' తమిళ ప్రింట్‌ను గుల్జార్ చూశాక నా ఇతర పిక్చర్లను కూడా చూడాలన్న కోర్కెను వెలిబుచ్చారాయన. ఇది మరింత గర్వించాల్సిన విషయం," అన్నారు బాలచందర్.

★ లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీత దర్శక ద్వయంలో లక్ష్మీకాంత్ "దేశ్ ప్రేమీ" చిత్రంలో ఓ పాట పాడాడు. "తేరీ కసమ్" చిత్రంలో కెమెరా ముందు నటించబోతున్నాడుకూడా.

★ "గాడ్ ఫాదర్, గాడ్ ఫాదర్—2" చిత్రాలతో ధనంతోపాటు ఖ్యాతిని విశేషంగా ఆర్జించిన హాలివుడ్ దర్శక నిర్మాత ఫ్రాన్సిస్ ఫోర్డ్ కొప్పోలా తదుపరి చిత్రం "ఒన్ ఫ్రమ్ ది హెవెన్" చిత్రానికి తను ఆర్జించిన సొమ్మంతా వెచ్చించాడు. ఈ చిత్రం ఫ్లాప్ అవడంతో బాగా నష్టపోయి, దివాలాకోరు కూడా అయ్యాడట పాపం.

★ బొంబాయి 'పాలిహిల్'లో సునీల్‌దత్‌కు ఓ డబ్బింగ్ థియేటర్ ఉంది. అందులోకి పాదరక్షలతో ఎవరూ వెళ్ళకూడదు. ఓసారి ఓ ప్రాతికేయుడు పాదరక్షలతో ప్రవేశిస్తే, "ఈ థియేటర్ పవిత్రమైన దేవాలయం లాంటిది. దేవాలయంలోకి పాదరక్షలతో ఎవరైనా వెళ్తారా?" అని సునీల్‌దత్ అంటే, ఆ ప్రాతికేయుడు "మరి, హాలివుడ్ మాటేమిటి? అక్కడ డబ్బింగ్ థియేటర్‌లోకి పాదరక్షలతో వెళ్లడం నేను కళ్ళారా చూశానే!" అన్నాడట. దానికి సునీల్‌దత్ "పాశ్చాత్యులు అసలు చర్చిలోకే పాదరక్షలతో వెళ్తారు తెలుసా?" అని చిన్న చురక వేశాడట.




(గత సంచిక తరువాయి)

మార్చి 18వ తేదీ!

వెంకట్ పరిస్థితిలో ఏ మార్పూ కన్పించటం లేదు! ఇంకా అలాగే ఉన్నాడు! పోనీ, ఎవరైనా వేరే డాక్టర్ని తెద్దామంటే ఎవ్వరూ ముందుకు రావటంలేదు!

ఆ సమయంలో ఏం చేయాలోకూడా అర్థం కాకుండా బుర్రలు మొద్దుబారిపోతున్నాయి! ఎవరికీ నిద్రాహారాలు లేవు! అందరూ కలిసి మృత్యువుతో హోరాహోరీ పోట్లాడుతూన్నట్లుగ ఉంది!

అచేతనంగా పడి ఉన్న వెంకట్‌ని చూసి నిశ్శబ్దంగా కళ్ళు తుడుచుకోవటం తప్ప మరో వ్యాపకమే లేకుండాపోయింది!

"ఇంక ఈ డాక్టరువల్ల ఏమీ ప్రయోజనం లేదు." నిరాశగా అన్నాడు వెంకటేశ్వర్రావు.

"మరేం చేద్దాం?" ఆదుర్దాగా అన్నది కళ్యాణి.

"అదే ఏంచేయాలో తెలియటంలేదు." అనే బాధతోనూ, ఏమీ చేయలేకపోతున్నామే అనే ఆవేదనతోనూ, వెంకట్‌ని అసలు ప్రాణాలతో దక్కించుకోగలమా అనే ఆందోళనతోనూ కళ్ళనీళ్ళు పెట్టుకోవటం తప్ప మరో దారి చూపే ఆలోచనే తట్టటంలేదు!

"వెంకటేశ్వర్రావు! నువ్వెలాగయినా బందరు వెళ్ళి చంద్రాన్ని తీసుకురా! అతను ఏదయినా చేయగలడు!" ఆశగా అన్నది తార.

ఆ పరిస్థితుల్లో ఎవరికైనా అలాగే ఉంటుంది 'ఎవరో ఏదో చేయగలరు' అనే ఆశ కొండంత బలాన్ని ఇస్తుంది. 'నిజంగా చేసేస్తారు' అనే నమ్మకాన్ని పెంచుతుంది.

అవును! ఆశను జయించటం ఎవరి తరమూ కాదు!

వెంకటేశ్వర్రావు చంద్రాన్ని తీసుకొచ్చాడు. చంద్రంతోపాటు రామ్మోహన్, ప్రసాదు, జయమ్మ అంతా వచ్చారు.

'మంచితనానికి మారుపేరులా, ఉత్సాహానికి ప్రతిరూపంలా ఉండే బావ ఎలా అయిపోయారు!'

ఆప్యాయంగా తనను చుట్టిన ఆ చేతులు వుల్లల్లాగా వ్రేళ్ళాడుతూండటం చూసి చంద్రం ఏడ్చేసాడు! రామ్మోహన్, ప్రసాదు నిశ్శబ్దంగా దుఃఖాన్ని మింగటానికి ప్రయత్నం చేస్తున్నారు. కాని, చంద్రం నిగ్రహించుకోలేకపోయాడు. తనని తాను ఎంతగా కంట్రోలు చేసుకుందామన్నా వీలుకాని స్థితిలో వెక్కి వెక్కి ఏడ్చేసాడు. ఆ ఉధృతం తగ్గాక, కళ్ళు తుడుచుకుని, చేయాల్సిన కర్తవ్యం గురించి ఆలోచిస్తున్నాను.

"ఎలా రారో చూస్తాను! కాళ్ళూ చేతులూ కట్టి మరీ తీసుకొస్తాను." అన్నాడు చంద్రం ఆవేశంగా.

"ప్చ్! లాభం లేదురా. అలాటి దౌర్జన్యాల వల్ల ఇంకా చిక్కుల్లో పడటం తప్ప ప్రయోజనముండదు. అలా వద్దు." అన్నాడు రామ్మోహన్.

"లేదురా. మనం మెత్తగా ఉంటే వాళ్ళు ఇంకా రెచ్చిపోతూనే ఉంటారు. మనం ఎదురు తిరిగితేనే కానీ వాళ్ళు మనకు లొంగిరారు!"

చంద్రం భుజంపై 'శాంతించు' అన్నట్లుగా మెల్లగా తట్టి, అటూ ఇటూ పచార్లు చేస్తున్న ప్రసాదు ఉన్నట్లుండి అడిగాడు. "తారా! గుడివాడలో మన బంధువులొకాయన డాక్టరుగా ఉండాలి కదూ?"

తారకు అంత కష్టంలోనూ నవ్వొచ్చింది "ఎంత అమాయకుడివి ప్రసాద్! నాన్నకు వైద్యం చేయమంటేనే మొహం చాటుచేసుకున్న అతను ఈయనకు చేస్తాడా!" అంది నిరాశగా.

"అతను చేయటమేమిటి! మనం చేయించుకోవాలిగాని! ఎవరతను మామయ్యా! అతని పేరేమిటి? అతని అడ్రసు తెలుసా?" తీవ్రంగా అడిగాడు చంద్రం.

"అలాగ ఆవేశపడబోకురా చంద్రం. ఇప్పటికే ఇన్ని చిక్కుల్లో ఊపిరాడక సతమతమయిపోతున్నాం ప్రపంచంలో ఎంతమంది లేరు చెప్పు! అందరిలాగ మనమూ ఉంటే ఈ బాధలూ, ఈ సమస్యలూ ఉండేవేకాదు కదా! మీ బావగారి ఆవేశానికే ఇంత పిచ్చివాళ్ళమైపోతూంటే, ఇహ నువ్వుకూడా అలా తయారవబోకు" ఆవేదనగా అన్నది తార.

"నువ్వేమీ భయపడబోకక్కా! నేనూ వెళ్తాను మంచిగా, మర్యాదగా పిలుస్తాము! వాడు వస్తాడా, వస్తాడు! 'రాను' అంటూ మొండికేస్తే ఏం చేయాలో, ఎలా తీసుకురావాలో తర్వాత ఆలోచిస్తాం" అనునయంగా అన్నాడు రామ్మోహన్.

"ఆఁ — అతని పేరు అట్లూరి రాఘవయ్య' అవునా?" ఇందాకట్నుంచీ అదే ఆలోచిస్తున్నట్లుగా అడిగాడు ప్రసాదు.

"ఊఁ —"

* * *

మార్చి 27వ తేదీ!

'వెంకటరత్నం కొంచెం ఫర్వాలేదు' అనే పరిస్థితిలో ఉన్నాడిప్పుడు.

ప్రమాద స్థితిని దాటాడు!

ఈ ప్రపంచంలో ఏ పని నయినాసరే నయానో, భయానో సాధించుదాము అనుకుంటే—అది నయాన మాత్రం సాధ్యం కాదు! తప్పనిసరిగా అది భయాననే జరిగి తీరుతుంది!

ఆ రోజు అట్లూరి రాఘవయ్యగార్ని కూడా మర్యాదగ రమ్మంటే రానని మొరాయించారు! అప్పుడిహ గత్యంతరం లేక దౌర్జన్యంతోనే అతడ్ని తీసుకు రాగలిగారు.

వచ్చి చూడగానే "లాభం లేదు ఈ కేసు తీసుకోను" అనేసాడు.

ఒకవైపు సత్యవతి, మరోవైపు తారా ఆయన రెండు కాళ్ళూ పట్టుకుని ఏడ్చేసారు. ఆ యింట్లో కాస్త బిగ్గరగా ఏడవనూకూడదు; మాట్లాడుకోనూ కూడదు!

కారణం — ఇంటి చుట్టూ కాపలా కాస్తున్న పోలీసులు!



**జరిగిన కథ—20** కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార. ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటయిన తరువాత కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. తత్ఫలితంగా వెంకట్‌ను పట్టుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది పోలీసుశాఖ. అతనిప్పుడు పూరిగా వేషం మార్చేసి తప్పించుకు తిరుగుతుంటాడు. తమకి దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడనే కోపంతో వెంకట్ ఇంటిపై మెరుపు దాడులు చేస్తూ అతని కుటుంబ సభ్యులతో చాల అసభ్యంగా, అమానుషంగా ప్రవర్తించుతుంటారు పోలీసులు. వెంకట్ ఆజ్ఞపై తార పిల్లలతో పుట్టింటికి వెళ్తుంది. భాగస్వామిని నమ్మి మోసపోవడంతో, రాఘవయ్యగారు చాలా కృంగిపోయారు. పిల్లలను ప్రసాద్ తనవెంట తీసుకు వెళ్తాడు. ఇక నాగరత్నమ్మ నోటికి, చేసే పనులకు అదుపు అనేది లేకుండాపోయింది. రాఘవయ్యగారికి పక్షవాతం రావడంతో కుడికాలూ, చెయ్యీ పడిపోతుంది. తారను తీసుకు రమ్మని వెంకట్ మనిషిని పంపితే రాఘవయ్యగారు అంగీకరించకపోవడంతో వెళ్లలేకపోతుంది. డి. యస్. పి. పళనియప్పన్ 37 మంది విప్లవకారుల ప్రాణాలు తీసాడు. అతని పేరు వింటేనే అందరూ వణికిపోతున్నారు. చంద్రం ఉద్యోగంలో చేరతాడు. 'మునగాల పరగణా'లో తమ పార్టీ చాలా వెనుకబడి ఉండడంతో అక్కడికి వెళ్తాడు వెంకట్. వెంకట్ జ్వరంతో మంచాన పడతాడు. అతనికి ఏ విధమైన సహాయం అందకుండా పోలీసులు కాపువేస్తారు. తార తన పిల్లలతో అత్తవారింటిలో వున్న వెంకట్ దగ్గరికి చేరుకొంటుంది.

అంతకంటె ఘోరమయిన దురదృష్టం మరొకటి ఉండదేమో!

ఏడవటం కూడా నిశ్శబ్దంగానే ఏడవాలి!

కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్న వాళ్ళను చూసి 'డాక్టరు' హృదయం ద్రవించింది కాబోలు. వెనక్కు తిరిగి వెంకటరత్నం మంచాన్ని సమీపించారు. ఆ క్షణం నుండీ అతను వారంరోజులపాటు ఇహ ఇంటి కెళ్ళలేదు. రాత్రింబవళ్ళు వెంకట్ దగ్గరే ఉండి, దాదాపు మృత్యువు కోరల్లో చిక్కుకుని సగం నలిగి పోయిన వెంకట్‌ని ఎలాగో రక్షించగలిగాడు!

బయట జనానికి వెంకటరత్నం అవసానదశలో ఉన్నాడనే వార్త విపరీతమయిన ఆందోళన కలిగించింది.

అతడ్నిచూడటానికి జనం గుంపులు గుంపులుగా రావటం ప్రారంభించారు.

బయట పోలీసుల కాపలా కూడా అధికంగానే ఉన్నది! అసలు వాళ్ళకు ఇంట్లో రాఘవయ్య అనే డాక్టరు ట్రీట్‌మెంటు ఇస్తున్నాడనే విషయం తెలియదు. తెలిస్తే ఎపుడో ఆ డాక్టర్ని జైల్లో పడేసి, బహుశా మంచం చుట్టూ కాపలా ఏర్పాటు చేసి ఉండేవారు. అందుకే అర్జంటుగా తేవాల్సిన మందుల్ని కూరల సంచీల్లోను, పండ్లబుట్టల్లోనూ, బియ్యం మూటల్లోనూ దాచి తెస్తూనే ఉన్నారు.

వెంకట్రామయ్యగారు ఎటూ కదలకుండా ముందు వరండాలో అలాగే కూర్చుండిపోయారు! వెనుక వరండాలో సీతారామయ్య ఉండేవాడు! ఎపుడైనా పోలీసులు చెకింగు చేయటానికి లోపలకు వస్తుంటే చిన్నగా శబ్దం చేసేవారు! అది అర్థం చేసుకుని లోపలివాళ్ళు జాగ్రత్తపడేవారు!

అతన్ని చూడటానికి వస్తున్న జనాన్ని మొదటిరోజు పోలీసులు అడ్డగించగానే వెనక్కు తగ్గారు! కానీ, రెండో రోజునుండీ మాత్రం పోలీసుల్ని లెక్కచేయలేదు, ఎవర్నీ లెక్కచేయలేదు!

'మీరు కాదు కదా, మిమ్మల్ని సృష్టించిన ఆ శక్తి అడ్డం వచ్చినా ఆగేదిలేదు!' అన్నట్లుగా తోసుకుని మరీ వచ్చేసారు.

ఇంక చేసేది లేక వెంకట్ పడకను కిటికీకి దగ్గరగా మార్చారు. ఆ వచ్చేవాళ్ళంతా కిటికీ నుంచి చూసి వెళ్తుండేవారు!

వెంకటరత్నానికి ప్రమాదస్థితి దాటిపోయిన తర్వాత వెంకటేశ్వర్రావు గదిలోపలే ఉండి ఆ వస్తున్నవాళ్ళు ఎవరెవరో అందరకూ చెబుతుండేవాడు.

వాళ్ళంతా మారువేషంలో వస్తుండేవారు! బుడబుక్కలవాడుగానూ, కోయదొరల్లాగనూ, మస్యాడీల లాగానూ, గొర్రెల కాపర్లగానూ—ఎన్నో వేషాలలో వస్తుండేవారు! వాళ్ళంతా ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచిన గొప్ప గొప్ప విప్లవనాయకులు! కమ్యూనిస్టుపార్టీ రథానికి చక్రాల్లాంటివాళ్ళు!

అపుడపుడూ చిన్న చిన్న కాగితాల పొట్లాలు "దేవుడి కుంకుమ! బాబుకెట్టండి! తగ్గిపోతాది!" అంటూ ఇచ్చి వెళ్తుండేవారు! తర్వాత అవి విప్పితే అందులో కుంకుమతోపాటు ఏదో వ్రాసి ఉండేది!



కొందరకు – మరీ పల్లెటూళ్ళలోని పేద ప్రజలకు నిజంగా వెంకట్ అంటే దేవుడికన్నా ఎక్కువ! ప్రతిఇంట్లోనూ వెంకటరత్నం ఫొటో ఉండేది! అవునుమరి! వాళ్ళ ప్రతి అవసరాన్ని వెంకటరత్నమే తీర్చేవాడు!

నిద్రపోతూన్న కార్మికులను, కష్టపడటం తప్ప ఆలోచించటం చేతకాని కర్షకులనూ మేలుకొలిపి, వాళ్ళల్లో ఆలోచనా శక్తిని పెంచి, విజ్ఞాన సముపార్జనలో ఆసక్తిని పెంచి వాళ్ళను కూడా మనుష్యులుగా, వ్యక్తులుగా నిలబెట్టినవాడు వెంకటరత్నం! ఏమి వ్రాసారో కూడ తెలియని ప్రోనోట్ల మీద గుడ్డి నమ్మకాలతో తప్పనిసరిగా వేలిముద్రలు వేసి, సర్వస్వాన్ని కోల్పోయి, గాఢాంధకారంలో అంధుల్లాగా విలవిల్లాడుతూన్న ఆ పేద ప్రజానీకాన్ని ఆదుకుని, రక్షించి, 'వాళ్ళకూ' అంటూ జీవితాలను ఏర్పాటు చేసినవాడు వెంకటరత్నం!

వాళ్ళ దైవం వెంకట్!

వాళ్ళ ప్రాణం వెంకట్!

వాళ్ళ విజ్ఞానం వెంకట్!

వాళ్ళ ఆలోచన వెంకట్!

వాళ్ళ ఊపిరి వెంకట్!

వెంకట్! వెంకట్!! వెంకట్!!! వాళ్ళ సర్వస్వమూ వెంకట్!

వేలకొలది ప్రజానీకం కిటికీకి అనుకుని వెంకటరత్నాన్ని చూస్తూ కన్నీరు మున్నీరుగా విలపించేవాళ్ళు!

'ఇంతమంది గుండెల్లో చోటు చేసుకున్న వెంకటరత్నానికి భార్యనైన నేను ఎంత అదృష్టవంతురాల్ని!' అనుకునేది తార.

'ఒక్క మనిషి కోసం ఇంతమంది బాధపడుతున్నారా! తనకోసం కన్నీరు కార్చగలిగేవాడు ఒక్కడు – ఒక్కడుంటే చాలు! అనుకునేంతగా పెరిగిపోయిన ఈ స్వార్థ సమాజంలో ఒక్కడి కోసం ఇంతమంది ఏడవటమా! అంతటి మంచి మనిషికి తన చేతులమీదుగా ప్రాణం పోయటం అనేది ఒక మరపురాని విషయం! తన డాక్టర్ జీవితంలో ఇదొక అలౌకికమైన అనుభవం!' అనుకునేవారు డాక్టరు రాఘవయ్యగారు.

పెద్ద పెద్ద నాయకులంతా పిచ్చివాడుగానూ, బిచ్చగాడుగానూ వేషాలేసుకుని వచ్చి కిటికీ దగ్గర చూసిపోతుంటే వెంకటరత్నం ఆ పార్టీలో ఎంత లోతుకు చొచ్చుకుపోయాడో, అతను ఎంత పటిష్టమయిన స్థానం సంపాదించుకున్నాడో తెలుస్తున్నాది.

'పాపం! వాళ్ళు ఎక్కడెక్కడినుండో వస్తుంటారు! వాళ్ళకు భోజనం ఏర్పాటు చేయటం మన మర్యాద!' అని వెంకట్రామయ్యగారు వచ్చిన ప్రతి మనిషికీ భోజనం పెట్టి పంపించేవారు!

* * *

ఏప్రిల్ 4వ తేదీ!

వెంకటరత్నం పుట్టిన రోజు!

అతనికి ఆ రోజు డాక్టరుగారు పథ్యం పెట్టవచ్చు అన్నారు! అనటమే కాకుండా మధ్యాహ్నానికి వచ్చి, దగ్గిరుండి మరీ పెట్టించారు.

అయితే అతనికి జ్వరం తగ్గిందని పోలీసులకు తెలియనీయలేదు. పైగా, 'ఇంకా అలాగే ఉన్నాడు',

# తార

'ఇవ్వాళో, రేపో! అన్నట్లున్నాది అతని పరిస్థితి' అనే వార్త కావాలని బయటకు చెప్పించుతున్నారు! ఇదివరకు ఎప్పుడూ మంచంలోనే ఉండే వెంకట్‌ని ఇపుడు పడక్కుర్చీలోకి మార్చారు! అతనికి ఇంకా గడ్డం తీయనేలేదు! అందువల్ల అతని ముఖంలో ఇంకా రోగలక్షణాలు కనిపిస్తూనే ఉన్నాయి!

డాక్టర్ని దగ్గర కూర్చోబెట్టుకుని నెమ్మదిగా అడిగాడు. "డాక్టర్! ఇవ్వాళ నేను బయటకు వెళ్ళనా?"

"ఇవ్వాళా! ఇవ్వాళ ఎలా వెళ్తారు! ఇంత నీరసంలో బయటకు ఎలా వెళ్ళగలుగుతారు?"

"లేదు డాక్టర్! వెళ్ళిపోవాలి! నేనిక్కడే ఉన్నా తీసుకెళ్ళి జైల్లోనయినా పడేస్తారు! లేదా కాల్చి అవతలయినా పారేస్తారు!" ఆ మాటలు వింటూంటే అక్కడ ఉన్న అందరకూ కళ్ళవెంబడి నీళ్ళు గిర్రున తిరిగాయి!

డాక్టరుగారు కూడా అతని చేతిని ఆప్యాయంగా నొక్కుతూ "అలాగే వెళ్దురుగాని! కాని, ఇవ్వాళ వెళ్ళలేరు! రెండు రోజులు అయ్యాక వెళ్దురుగాని."

ఆ రోజే చంద్రం, రామ్మోహన్, ప్రసాదు వచ్చారు. వెంకట్‌కు ప్రమాద పరిస్థితి దాటిపోగానే వాళ్ళు వెళ్ళిపోయారు. ఇవ్వాళ పథ్యం పెట్టేమన్నామని డాక్టరు చెబితే మళ్ళీ వచ్చారు. వెంకట్‌ని చూసి వాళ్ళు చాలా సంతోషపడ్డారు! వెంకట్ కూడా వాళ్ళని చూసి ఆనందంగా నవ్వాడు. దగ్గిరకు పిల్చి కృతజ్ఞతలు తెలిపాడు.

"ఛ! అదేమిటి బావా! అలా అంటావ! అది మా బాధ్యత! మేము అలా ఉంటే మీరు చేయరా!"

"ఏమో! నేను చేయగలనో, లేదో నాకే తెలియదు! సరే! తారా, ప్రసన్న, రేణు – వాళ్ళ ముగ్గుర్నీ మీకు అప్పగించేస్తున్నాను" అతను అలా అంటూంటే వింటూన్న వాళ్ళకు చాలా విచారం అనిపించింది. పిల్లలను తీసుకొచ్చి అతని దగ్గర వదిలి తార ఏడ్చేసింది కూడాను. వెంకటేశ్వర్రావు గబుక్కున లేచి కిటికీ తలుపులు మూసాడు.

తార ఏడుస్తుంటే విచిత్రంగా చూసాడు వెంకట్. "అవునండీ! నాకు ఏడుపే వస్తున్నాది! ఇంక మీరీ కార్యక్రమాలు వదిలేసుకోండి! చూడండి– స్వాతంత్ర్యం వచ్చింది! ఇంక ప్రజల్ని దేశమే కాపాడుతుంది! అందువల్ల ఆ ప్రజల సంగతి వదిలేసి ఈ రెండు జీవితాల గురించి ఆలోచించండి!" ఏడుస్తూన్న తారను చూసి చాలా ఆశ్చర్యపోయాడు వెంకట్.

అక్కడే ఉన్న చంద్రం, రామ్మోహన్, ప్రసాదు, సత్యవతి, దమయంతి, కళ్యాణి – అందరి కళ్ళల్లోనూ 'అవును! అదే మంచిది! ఏమంటావు?' అన్న భావమే కన్పిస్తోంది. అతను ఏం చెబుతాడో అనే ఆదుర్దా కనిపిస్తోంది! అది చూసి గాఢంగా నిట్టూర్చాడు వెంకట్.

"ఓహో! మీరు అర్థం చేసుకున్నది ఇంతేనా! మీ ఆలోచనా శక్తి అంతవరకేనా!" అన్నట్లుగా ఉన్నాదా నిట్టూర్పు.

చంద్రాన్ని తలుపులు తెరవమన్నాడు. అప్పటికే కిటికీ దగ్గరకు వస్తూన్న పోలీసువాడు "ఏమిటి తలుపులు మూసారెందుకు?" అన్నాడు.

"అతనికి బట్టలు మార్పించటానికి" అన్నాడు వెంకటేశ్వర్రావు.

"ఏమిటి! అందరూ అక్కడే ఉన్నారెందుకూ?"

ఛర్రుమన్నది చంద్రానికి. గబగబా బయటకి వెళ్ళి పోలీసువాడి కర్ర పట్టుకుని వాడ్ని తీసుకెళ్ళి బయట గేటు దగ్గర వదిలి "ఇక్కడే కూర్చో! ఇక్కడ నుంచి లోపలికి రాకు! ఇదిగో – ఈ రూపాయపెట్టి బీడీలు కొనుక్కుని కాల్చుకో!" అన్నాడు. వాడు గుర్రుగా చూసాడు. వెంటనే చంద్రం నవ్వుతూ వాడి టోపీపై హాస్యంగా కొట్టి చమత్కరించి, వాడి కోపాన్ని పోగొట్టి లోనికి వచ్చాడు.

ఆ యింట్లో మాట్లాడుకోవటానికి కూడ వీలుకాదు. అవసరమయినపుడు చిన్న చిన్న మాటలు రహస్యంగా మాట్లాడుకోవాలి. అందుకనే వెంకట్ కాగితాలు తీసుకుని బరబరా ఏదో వ్రాసేస్తున్నాడు. వ్రాయటానికి అతని చేతుల్లోకి ఇంకా శక్తి రాలేదు. అయినాసరే వ్రాస్తున్నాడు. మధ్య మధ్యలో పెన్ను క్రిందపెట్టి వ్రేళ్ళు నొక్కుకుంటూ వ్రాస్తూనే ఉన్నాడు.

తర్వాత ఆ కాగితాలు తార చేతికి ఇచ్చాడు. 'చదువు' అన్నట్లుగా సైగచేసాడు.

"తారా! ఇంతకాలం నా ఆశయాలకూ, నా ఉద్దేశాలకూ నా జీవితాన్ని వదిలేసి ఇవ్వాళ, ఈ విధంగా నన్ను కట్టేయాలనుకోవటం మీకు న్యాయమేనా! తారా, నేను చేస్తున్నదానిలో నీకు తప్పు కన్పిస్తూండవచ్చు! 'నా పిల్లల్ని మరొకరి దయా దాక్షిణ్యాలకు వదిలేసి ఊరి జనాన్ని కాపాడ లనుకోవటం శుద్ధ తెలివి తక్కువతనం!' అని నీ ఉద్దేశం!

కానీ, కాదు తారా! నా పిల్లల్ని చూడటానికి మీరింతమంది ఉన్నారు. కానీ – వాళ్ళను చూడటానికి ఎవరున్నారు! చంద్రం, మోహన్, తారా! నన్నర్థం చేసుకోండి! నన్ను మీ ఆప్యాయతలతోనూ, మీ ప్రేమలతోనూ, మీ కన్నీళ్ళతోనూ ఆపాలని చూడబోకండి. మంచో, చెడో 'నా జీవితం వాళ్ళకే' అని నిర్ధారణ అయిపోయిన తర్వాత ఇపుడు ప్రాణాలకు ఆశపడి దొంగలాగా, ఒక వెధవలాగా బ్రతకమంటారా! ఆనాడు – నన్ను నేను క్షమించుకోగలనా! అమ్మ అంటే – అర్థం చేసుకునే విజ్ఞానమూ, ఆలోచించే శక్తి లేదని అనుకోగలను. కానీ, మీరుకూడా అదే పాట పాడుతూంటే ఎలాగు!

తారా! నువ్వు బాధపడొద్దు! నేను చచ్చిపోతానేమోననే భయం వద్దు! ఏం జరిగినా – నా పిల్లల్ని చక్కని పౌరులుగా తీర్చిదిద్దగల నువ్వున్నావు! కొండంత మేనమామల అండ ఉన్నాది! మామగారి ఆశీర్వచనం ఉన్నది! నాన్నగారి సహాయం ఉంటుంది! కానీ... కానీ... తారా! వాళ్ళకెవరున్నారు? వాళ్ళ దీనపరిస్థితి ఆలోచిస్తూంటే 'అయ్యో! పాపం!' అన్పించటంలేదూ! వాళ్ళను ఒక దారికి తీసుకురావాలి అని అన్పించటంలేదూ! వాళ్ళకోసం ఏం చేయటానికయినా సిద్ధమే అని అన్పించటంలేదూ! ప్చ్! నేనిక్కడ ఉండలేను తారా! నా జీవితం నాదికాదు! కేవలం – వాళ్ళది! అంతేకాను తారా–

శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

# ప్రేమ మూర్తులు



చూడూ ! మాది వ్యక్తి పోరాటం కాదు ! సమిష్టి సమాహార పోరాటం ! ఇదొక మహాసమరం ! ఈ విప్లవ జ్యోతిని వెలిగించింది అర్ధాంతరంగా ఆపేయటానికి కాదు ! ఆ జ్యోతి చూపించే అఖండమైన వెలుగులో ముందుకు ముందుకు ఇంకా ముందుకు చొచ్చుకపోయి స్వతంత్రాన్ని సాధించితీరాలి ! స్వాతంత్ర్యం ! అవును ! స్వాతంత్ర్యమే ! మొన్న మనకు వచ్చింది స్వాతంత్ర్యం కానేకాదు ! అసలు నిజమైన స్వాతంత్ర్యం ఇంకా మనకు రానేలేదు ! స్వాతంత్ర్యం అంటే ఏమిటి ! ప్రతివ్యక్తి తనకు కావలసిందీ, తనకు అవసరమయిందీ తేలిగ్గా పొందగలిగిననాడే మనకు నిజమైన స్వాతంత్ర్యం ! స్వాతంత్ర్యం అనేది ఏ కొద్దిమంది చేతుల్లోనో బందీ అయిపోయి నలిగిపోయే పేపర్లు మాత్రమే కావు ! ప్రతి వ్యక్తి స్వేచ్ఛగా, సంతోషంగా, నిండుగా నవ్వుతూ బ్రతికిననాడే — మనకు నిజమైన స్వాతంత్ర్య దినం !

అల్లూరి సీతారామరాజు, భగత్ సింగ్ — ఇంకెంతోమంది ఎన్నో శ్రమలకోర్చి అష్టకష్టాలు పడి జీవితాలనే ధారపోసారు ! స్వాతంత్ర్య సమరంలో కాలు దువ్వి, కవ్వించి, ఖబడ్దార్ అనిపించి, మంచు కొండల్లాగా నిలబడి కన్నుమూసారు !—ఎవరికోసం ?!

మన్య ప్రజలు ఎవరు ?

ఆనాడు స్వాతంత్ర్య సమరంలో ప్రజాక్షేమం కోసం, దేశసౌభాగ్యం కోసం అసువులు బాసిన అమరవీరులు నిజంగా ధన్యులు ! కానీ — కేవలం వాళ్ళ త్యాగాల వల్లనే మనదేశ జాతీయ జెండా ఎగరటంలేదు ! ఇంకెంతోమంది అజ్ఞాతవ్యక్తులు అనన్య సామాన్యమయిన ప్రతిభాశక్తులు మరుగున పడిపోయాయి ! ఎందరో మహానుభావులు చేయని నేరాలను నెత్తిన వేసుకుని ఇంకా అజ్ఞాత వాసంలోనే ఉన్నారు !

అసలు స్వాతంత్ర్యం రావలసిన వాళ్ళకు స్వాతంత్ర్యం రాలేదు! వాళ్ళ జీవితాలలో ఏ మార్పూ లేదు ! మార్పు తీసుకురాని స్వాతంత్ర్యం స్వాతంత్ర్యమేనా ! అందుకే నేను ఇంకా స్వాతంత్ర్యం రాలేదనే అంటాను ! సీతా - మరాజు త్యాగానికీ, పట్టుదలకూ, అతని పోరాటానికీ అర్థమే లేకుండాపోయింది ! వాళ్ళు అలాగే ఉండిపోయారు ! అందుకే తారా ! అందుకే మా యీ పోరాటం !

దొంగలు ఇంటబడి దోచుకోవటం అంతా అయిపోయాక మనం అరిచి కేకలు వేసినాపోతారు ! వేయకపోయినా పోతారు ! వాళ్ళను పొమ్మని మనం చెప్పాల్సింది మొదట్లో కానీ, ఇప్పుడుకాదు ! మన దేశం కూడా అంతే ! సంపదలన్నీ తరిగిన మన దేశంలో దోచుకోవటానికి ఇంకా ఏం మిగిలి ఉందని ఆంగ్లేయులు ఇక్కడే ఉంటారు !

స్వర్ణయుగమనీ, సర్వసంపదలతో అలరారు పుణ్యభూమి మన భారతదేశమనీ విన్నాము ! అలాటి దేశం —

ఎటుచూసినా నిండుగా ఉన్న మనదేశసౌభాగ్యాన్ని దోచుకోవటానికి వచ్చిన తెల్లవాడికి ఆశ్రయం ఇచ్చింది ఎవరు ? స్వార్ధపరులైన కొందరు



## తా ర

భారతీయులు ! అల్లూరి సీతారామరాజుని కాల్పించినదెవరు ? తోటి భారతీయుడు ! భగత్‌సింగ్‌ను చంపించిన దెవరు ? అంతేకాదు — దేశ సౌభాగ్యాన్ని సర్వనాశనం చేసి ఈ దౌర్భాగ్య స్థితికి తీసుకు వచ్చిందెవరు ? అంతెందుకు — ఈనాడు మమ్మల్ని చంపుతున్నదెవరు ? ఏ పేద ప్రజల కోసం రక్తతర్పణం జరుగుతున్నదో — వాళ్ళలో వాళ్ళే వీళ్ళున్నూ ?

రెండు వందల సంవత్సరాలు దోపిడీ చేసిన తర్వాత మన దేశంలో ఇంకా ఏ సంపదలు మిగిలి ఉన్నాయని ఆంగ్లేయులు ఇక్కడే ఉంటారు ! ఇవ్వాళ కాకపోతే రేపయినా వాళ్ళు వెళ్ళిపోతారు ! కాని... కాని... మన దేశంలోనే, మన మధ్యలోనే మిగిలిపోయిన స్వార్ధపరులు, డబ్బు పిశాచులు, అధికార దాహంతో కళ్ళు మూసుకుపోయి ప్రవర్తిస్తూన్న దేశద్రోహులు ఉన్నారే — వాళ్ళను— వాళ్ళను పట్టుకోవాల్సింది ! మన స్వాతంత్ర్యం ఉన్నది, వాళ్ళ తీరువాల్లోనే ! దాన్ని బయటకు లాగి ప్రతి వ్యక్తికీ పంచగలిగిననాడే మనకు నిజమైన స్వాతంత్ర్య దినం ! నేను కలలు కనే రోజు — ఆ రోజు ! నేను ఎదురుచూసేది ఆ సౌభాగ్యం కోసం ! నాకు కావాల్సింది, నేను చూడాలనుకుంటున్నదీ — ఆ సంబరాన్ని !

ఊరికొక జెండా, వీధికొక జెండా, ఎగరగానే మనకు స్వాతంత్ర్యం వచ్చేసినట్లుకాదు ! ప్రతి వ్యక్తీ — తామూ ఒక మనిషేననే నమ్మకంతో, హాయిగా నవ్వుతూ నిండుగా, స్వేచ్ఛగా బ్రతగ్గలిగిన రోజున — ఏ జెండా ఎగరకపోయినా మన దేశంలో 'మేము స్వతంత్రంగానే ఉన్నాము. హాయిగా బ్రతుకుతున్నాము' అని గొంతెత్తి చాటిచెప్పే ప్రజలే అసలైన జెండాలు !

ఖద్దరు పంచెలు కట్టి, తెల్ల టోపీలు పెట్టుకుని, జెండా పట్టుకోంగానే దేశనాయకులైపోరు ! దేశ సౌభాగ్యం కోసం, ప్రజాక్షేమమ్ము కోసం, పగలు మానవ జీవనం కోసం రాత్రింబగళ్ళు రక్తాన్ని చెమటగా మార్చి శ్రమపడే కార్మికులూ - మన దేశ సంపదలకు మూలస్థంభాలుగా, పట్టు కొమ్మలుగా నిలబడి భూతల స్వర్గం చేస్తూన్న కర్షకులూ — వీళ్ళు ! వీళ్ళు నిజమైన నాయకులు !

ఆ న్యాయం చేకూరేవరకూ, ఆ శాంతి వెంకొనేవరకూ - మా పోరాటం ఆగదు !

ఇవ్వాళ నన్ను కాల్చేసెయ్యగలరు ! కానీ, నా ఆత్మఘోషను కాల్చలేరు ! ఒక వెంకట్‌ను చంపితే ఆ శక్తి పది వెంకట్‌లుగా, వేయి వెంకట్‌లుగా, లక్ష వెంకట్‌లుగా విజృంభిస్తుంది ! ఇది నాతోనే అంతం కాదు ! మరెంతమందో వెంకట్‌లు పుడతారు ! పుట్టాలి !

అదే శక్తి ! విప్లవ శక్తి !!

ఆ శక్తి అంతై ఇంతై మహోన్నతమై దేశంలోని ప్రజాసముద్రాన్ని లేపి, ఒక మహా విప్లవం చెలరేగి పెచ్చుపెరిగిపోతూన్న అన్యాయాల్నీ, అక్రమాల్నీ కూకటివేళ్ళతోసహా పెకలించివేస్తుంది !

నేను కలలు కనే ఆ రోజు రేపు రావచ్చు ! ఎల్లుండి రావచ్చు ! ఒక సంవత్సరానికి రావచ్చు !

ఎక్కడి నుండో వచ్చిన తెల్లవాడిని తరమటానికే అన్ని సంవత్సరాలు పడితే, మన మధ్యలోనే ఉండి వెన్నుపోటు పొడుస్తూన్న సంఘ ద్రోహులను పట్టి పట్టి తరమటానికీ, ఆ చీడపురుగులను సమూలంగా నాశనం చేయటానికీ -- మరెన్ని సంవత్సరాలు పడుతుందో కదా !

ఏనాటికయినా ఆ రోజు వస్తుంది ! వచ్చి తీరుతుంది !

అదే నా కమ్యూనిజం !

ఆ రోజున, ఆ సమానత్వం వచ్చినరోజున, ఆ సోషలిజం సమకూరినరోజున—మీరు చెప్పకుండానే నేను వచ్చేస్తాను తారా ! అప్పటివరకూ మాత్రం నన్ను నాకు వదిలేయండి !''

అది చదివిన తర్వాత తార ఏం చేయగలదు ? చంద్రం ఏం చేయగలడు? సత్యవతి ఏం చేస్తుంది?

'ఎవ్వరూ ఏమీ చెయ్యలేము' అన్నట్లుగా కళ్ళు మూసుకుని పడక్కుర్చీలో వెనక్కువాలి కూర్చున్న అతని వంకే చూస్తున్నారు. అలా చూస్తుంటే — 'ఈ వెంకట్ మన మధ్య తిరుగుతూ మనతో ఉన్నా మనం అందుకోలేనంత ఎత్తుకు ఎదిగిపోయాడు' అనే ఆశ్చర్యమూ, అలౌకికమైన ఆనందమూ, భాషకందని భక్తి భావమూ వాళ్ళ కళ్ళల్లో స్పష్టంగా కన్పిస్తున్నాది.

(ఇంకా వుంది)

### ఆహారంతో కుటుంబ నియంత్రణ

పశ్చిమ జర్మనీలో ఒక శాస్త్రవేత్తల బృందం ఆహారంతో ముడిపడిన కుటుంబ నియంత్రణ పద్ధతిని అభివృద్ధి చేస్తున్నారు. శరీరంలో జరిగే ప్రతి మార్పుకు ఎంజైములే కారణం. పక్వం చెందిన అండాల గర్భసంచిలోనికి ప్రవేశించడాన్ని కూడా ఎంజైములు అదుపు చేస్తుంటాయి. వీరు కుందేళ్ళతో జరిపిన ప్రయోగాలలో కొన్ని ప్రత్యేక ఎంజైములు పక్వం చెందిన అండాలలో ప్రవేశించకుండా చేసినట్లు, మరికొన్ని ప్రత్యేక ఎంజైముల వలన పక్వం చెందిన అండాలు గర్భసంచిలోనికి ప్రవేశిస్తున్నట్లు ఋజువైంది. ఈ ఎంజైములు లేకపోతే గర్భధారణ జరగదు. ఈ ఎంజైముల తయారీని ప్రొటీన్లు నిరోధించగలిగితే, కుటుంబ నియంత్రణ సాధ్యమవుతుంది. కొన్ని రకాల ఆహార పదార్థాలను వివర్జించడం వలన యిది సాధ్యపడగలదని భావిస్తున్నారు. ఈ రకం కుటుంబ నియంత్రణ వలన దుష్ఫలితాలేమీ ఏర్పడవు. అయితే యీ పరిశోధనలింకా పూర్తికాలేదు.



# ఇది కథ కాదు

రమణశ్రీ

వర్షం ఒక్కసారిగా పెద్దదయింది.

చల్లగాలి రివ్వున వీస్తోంది. ఆకాశం ఎయిర్ కూలర్‌లా, భూమి రిఫ్రిజిరేటర్‌లా వుంది.

"బోయ్, ఆ కిటికీ తలుపు గూడా వేసేయ్!" అరిచాను డాక్టర్ ప్రసాద్.

అది ఆఫీసర్స్ క్లబ్!

అక్కడ గాజుల గలగలలులేవు. కానీ గాజుల గలగలలను మైమరపించే గాజుగ్లాసుల గలగలలు వాతావరణాన్ని వేడెక్కిస్తున్నాయి.

బయట విలయ తాండవం చేస్తున్న ప్రకృతి తాలూకు చిహ్నాలు ఆ గదిలో ఏమీ ప్రతిబింబించడం లేదు.

ఆ నగరంలో పెద్ద పెద్ద ఆఫీసర్లు, పేరు పొందిన డాక్టర్లు, లాయర్లు సభ్యులుగావున్నా క్లబ్ అది

ఆకాశానికి గండి పడినా, భూమి బద్దలైనా ఆ క్లబ్‌లో రాత్రిపూట లైట్లు వెలుగుతూ వుండ వలసినదే!

డాక్టర్ ప్రసాద్, లాయర్ విశ్వనాథ్, డియస్పీ ఫకీర్‌నాథ్, కంపెనీ ఎగ్జిక్యూటివ్ చక్రవర్తి ఆధ్వర్యంలో చతుర్ముఖ పారాయణం జోరుగా సాగి పోతున్నదా ఛాంబర్‌లో.

"షో ప్లీజ్" అంటూ పేక ముక్కలు టేబుల్‌పై పరిచాడు ఫకీర్‌నాథ్.

మిగిలిన ముగ్గురూ విసుగ్గా ముక్కలు గిరాటేసి డబ్బులు లెక్క చూసి యిచ్చేశారు.

"ఇక ఆట ఆపేద్దాం" అన్నాడు విశ్వనాథ్. ఆ రోజు అతని డబ్బు రమారమి మూడువేలు పోయాయి. మిగిలిన యిద్దరూ కూడా లాస్‌లోనే వున్నారు. అందుకే వెంటనే తల వూపేశారు

"ఫ్రెండ్స్! ఇంకా వర్షం తగ్గినట్లు లేదు. మరో ఆట వేద్దాం" ఉత్సాహంగా పేక కలుపుతూ అన్నాడు ఫకీర్‌నాథ్. ఆతవారోజు పక్కను తొక్కి వచ్చాననుకొంటున్నాడు.

"ప్లీజ్ వద్దులే! కావాలంటే మరో రౌండ్ కొడదాం" అంటూ "బోయ్" అని అరిచాడు ప్రసాద్.

మరుక్షణంలో అరిస్టోక్రాట్ విస్కీలార్జ్, ఐస్ క్యూబ్స్ జగ్‌తో ప్రత్యక్షమయ్యాడు బోయ్.

"అయితే యీ బిల్లు నీది". ఆట ఆపేసి నందుకు కసితో అరిచాడు ఫకీర్‌నాథ్.

"ఆల్‌రైట్! ఆ తరువాత పీటర్‌స్కాట్ భారం మాత్రం నీదే మమా!" చిరునవ్వు చిందించాడు ప్రసాద్.

తలాకాస్త పుచ్చుకున్నాక "కాలక్షేపం కోసం ఓ కథ చెప్పండి. ఎవరైనాసరే, బోర్ కొట్టగూడదు సుమా" అన్నాడు చక్రవర్తి మరో పెగ్ అందుకుంటూ.

"కథా?" నవ్వాడు విశ్వనాథ్.

"ఇక్కడ విస్కీదాసులు తప్ప హరిదాసులెవరూ లేరోయ్" అన్నాడు పకపక నవ్వుతూ.

"మందుపడిన తర్వాత హరిదాసులూ, కాళిదాసులూ కాని వారెవరోయ్? కథలూ, కవిత్వాలూ, సైత్యాలు వరుసగా రావలసినదే!" బాటిల్ ఎత్తి గొంతులో పోసుకుంటూ అన్నాడు చక్రవర్తి.

అంతే! అంతా మౌనం వ్యాపించిపోయింది. బయట పురుముల చప్పుళ్ళు మాత్రం లీలగా వినిపిస్తున్నాయి.

ఎవరికివారే సీరియస్‌గా కథ కోసం ఆలోచనల్లో పడిపోయినట్లుగా ఫీలింగ్ పెట్టేశారు.

కిటికీరెక్క కొద్దిగా తెరచి చూశాడు ప్రసాద్

వర్షం యింకా కురుస్తూనేవుంది వర్షం తగ్గగానే స్కూటర్ స్టార్ట్ చేయడానికి రెడీగా వున్నాడు ప్రసాద్. అతని కళ్ళముందు తెల్లచీర కట్టుకొని కోటి కోరికలూరే కళ్ళతో ఎదురుతెన్నులు చూస్తున్న తార దర్శనమిస్తోంది.

"మాకేమీ కథలు స్ఫురించడంలేదు" ప్రసాద్ తప్ప మిగిలిన వారందరూ సన్నగా గొణిగారు.

చిన్నగ నవ్వాడు ప్రసాద్.

"కాలం గడవడానికి కథలొక్కటే మార్గం కాదు అనుభవాల పునశ్చరణతో అవలీలగా కాలం గడపవచ్చు. మిస్టర్ ఫకీర్‌నాథ్ మీ పోలీస్ లైఫ్‌లో థ్రిల్లింగ్‌తో కూడిన అనుభవాలు కోకొల్లలుగ వుంటాయనుకుంటా! ఓ అనుభవాన్ని మాకూ పంచండి సార్" అన్నాడు ప్రసాద్.

అంతా కుతూహలంగా ఫకీర్‌నాథ్ వైపు చూశారు.

పీటర్‌స్కాట్ బాటిల్‌గూడా వచ్చి టేబుల్‌పై తిష్టవేసింది.

ఫకీర్‌నాథ్ మస్తిష్కంలో ఆలోచనల మథనం ప్రారంభమయింది.

రెండు నిమిషాలు గడిచాయి.

"దెయ్యాలంటే మీకు నమ్మకముందా?" హఠాత్తుగా అడిగాడు ఫకీర్‌నాథ్.

ఎక్కడో ఢనేల్‌మంటూ పిడుగు పడిన శబ్దమయింది.

అంతా ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు

"మిస్టర్ ఫకీర్‌నాథ్, అది తప్ప మీకు వేరే టాపిక్ ఏమీ దొరకలేదా?" అన్నాడు విశ్వనాథ్ అతని గొంతు సన్నగా వణుకుతోంది.

చిన్నగా నవ్వాడు పకీర్‌నాథ్.

"నా సర్వీస్‌లో నేను దెబ్బతిన్న సంఘటన అదే. నా రికార్డులో ఎరుపు రంగుకు స్థానం కల్పించిన సంఘటన అది!" చిన్నగా నిట్టూరుస్తూ అన్నాడు పకీర్‌నాథ్.

"వెల్. అయితే చెప్పండి" ఎంకరేజ్ చేశాడు ప్రసాద్.

పకీర్‌నాథ్ చెప్పడం ప్రారంభించాడు.

"అప్పుడు నేను డిపార్ట్‌మెంట్‌లో సబిన్స్‌పెక్టర్‌గా పనిచేస్తున్న రోజులు. నీతి నిజాయితీలకు, ధైర్యసాహసాలకు పెట్టిన పేరువాడి. ఆ రోజు చీఫ్ పిలిచి ఓ ఇన్ఫర్‌మేషన్ అందించారు. అది తెలుసుకున్న నాకు ఎంతో ఆశ్చర్యమేసింది. మాకు ఎవరికీ లభించని సమాచారాలు చీఫ్‌కు లభిస్తుంటాయి. అదే ఆయన ప్రత్యేకత!

శివార్లలో వున్న లేబర్ కాలనీలోంచి దొంగ బంగారం రవాణా అవుతున్నదట! అది ఎక్కడి నుండి ఎక్కడకు రవాణా అవుతున్నదో కనిపెట్టమని, అవసరమైన సాక్ష్యాధారాలు సంపాదించమని పురమాయించారు.

వెంటనే రంగంలోకి దిగాను. రెండు నెలలు లేబర్ కాలనీలో లేబర్‌గా నివసించాను. చిట్టచివరకు వారి రహస్య స్థావరాన్ని కనిపెట్టగలిగాను.

పైకి మామూలుగా కన్పించే గుడిసెలో కోట్లరూపాయల విలువచేసే బంగారం దొంగరవాణా జరుగుతోంది. వాళ్ళు ఎలా దానిని బయటకు చేరవేస్తున్నారో తెలుసుకున్నాను. ఇక సాక్ష్యాధారాలు సేకరించడమే తరువాయి.

ఆ రోజు మార్గమధ్యములో వారి దొంగరవాణా కార్యకలాపాన్నంతా కెమెరాలో భద్రపరచాలని నిర్ణయించుకొని కెమేరాతో బయలుదేరి నిర్జన ప్రదేశంలో నిల్చున్నాను.

సమయం అర్ధరాత్రి పన్నెండు గంటలయింది. కారుచీకటి కాలసర్పంలా బుసలు కొడుతూంటే, కీచురాళ్ళధ్వని వొళ్ళు జలదరింపచేస్తోంది.

అప్పటికి రమారమి రెండుగంటల నుండి నిలువుకాళ్ళ జపం చేస్తున్నాను.

హఠాత్తుగా నా కళ్ళు మెరిశాయి.

దూరరనుండి యువతి వస్తూ కన్పించింది.

నేను మరింత చాటుకు నక్కాను.

ఆమె మెల్లగా సమీపిస్తోంది.

విశాల మీన నేత్రాలు, చిదిమితే శృంగార మొలికేటట్లున్న చెక్కిళ్ళు, వదులుగా విరబోసుకొని వున్నా అందంగా కన్పించే జుత్తు, గుబాళించే మల్లెలు, అన్నింటినీ మించి ఆకర్షణీయమైన అంగసౌష్ఠవం! మావరులకు మతిపోగొట్టే అందం ఆమెది.

'ఎవరీ వడతి? ఈ నిర్జన ప్రదేశంలో నిర్భయంగా నడచి వస్తోంది? స్మగ్లర్స్ గ్యాంగ్‌లో యీమెను చూసిన గుర్తులేదు.' నా బుర్రలో ఆలోచనలు రగులుతున్న సమయంలో ఎక్కడిమండో చిన్నగా ఈల విన్పించింది.

ఉలిక్కిపడి ఈల విన్పించిన దిక్కుగా చూశాను.

దూరంగా పర్ణశాల లాంటి కుటీరం కన్పించింది

నాలో ఆశ్చర్యం అధికమయింది.

# ఇది కథ కాదు

ఇంతకు ముందు ఆ ప్రదేశంలో ఎలాంటి కుటీరాన్ని చూసిన గుర్తులేదు. అంత అకస్మాత్తుగా కుటీరం అక్కడ కెలావచ్చింది?

ఆ యువతి అటువైపుగా నడకసాగించింది.

నాలో ఉత్కంఠ పెరిగింది.

'ఈ మిస్టరీ ఏమిటో ఛేదించాలి. ఒకవేళ వీళ్ళు స్మగ్లర్స్ నియమించిన మనుషులేమో!'

ఆలోచన రావడమే తడవుగా అక్కడినుండి కదిలాను.

అడుగులో అడుగు వేసుకుంటూ ఆ యువతిని అనుసరించాను.

ఆ కుటీరంలోకి ప్రవేశించిందా యువతి.

రెండు నిమిషాలాగి ఆ కుటీరం బండారం బట్టబయలు చేయాలని కుటీరం దగ్గరకు నడిచాను.

సరిగ్గా అప్పుడే ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది.

ఆ కుటీరంలోనుండి రెండు ఆకారాలు వెలుపలకు వచ్చాయి.

ఒక ఆకారం స్త్రీది. మరో ఆకారం పురుషునిది. అయితే యింతకుముందు చూసిన స్త్రీ రూపం కాదది. నల్లటి భారీ కాయం, మొరటు పెదవులు, గడ్డిపోదలాటి జుత్తుతో వికృతంగా కన్పిస్తున్న నగ్న రూపమది. పురుషుడు కూడా అదే వికృత రూపంతో నగ్నంగా వున్నాడు.

ఇరువురూ కలిసి వెకిలిగా నవ్వుతున్నారు. నవ్వుతూ నా దగ్గరకు వస్తున్నారు.

వాళ్ళు నా దగ్గరకే వస్తున్నారు అనుకోగానే ఎంతో ధైర్యవంతుడనయిన నాకే కాళ్ళలోంచి వణుకు ప్రారంభమయింది. జేబులోంచి రివాల్వర్ తీయబోయాను. జేబులోకి వెళ్ళిన చేయి బయటకు రాలేదు. ఏదో విచిత్రమైన 'గాలి' సోకింది. అంతే, అలాగే నేల కొరిగిపోయాను.

స్పృహ వచ్చి చూసేసరికి అంతా గందరగోళం! నా వంటిమీద దుస్తులు వదులుగా కప్పివున్నాయి. అంటే నేను వివస్త్రుడనై వున్నానన్నమాట! చుట్టూ జనం మూగివున్నారు.

అప్పుడే గుంపులోకి జొరబడుతున్న మా మనుషులను చూడగానే నా ప్రాణం లేచివచ్చినట్లని పించింది.

హాస్పిటల్‌కని చెప్పి నన్ను చీఫ్ దగ్గరకు మోసుకుపోయారు.

నేను చెప్పినదంతా విని చీఫ్ చిరునవ్వు నవ్వి స్వయంగా బయలుదేరారు.

రాత్రి నేను నిల్చున్న ప్రదేశం దగ్గరకు వెళ్ళాము. నేను అక్కడ నిలబడి వున్నాననడానికి గుర్తుగా నేను కాల్చి వదిలేసిన సిగరెట్ పీకలు మినహా మరే గుర్తు లభించలేదు.

అక్కడక్కడ కన్పించే పొదలు తప్ప కుటీరమనే ఆకారం ఎక్కడా కన్పించలేదు. నాకు మతి పోయింది.

చీఫ్ కొంచం కళ్ళెర్రచేసి 'భ్రమించావు' అని కసిరాడు. దానితోబాటు నా పొజిషన్ కూడా మార్చిపారేశాడు.

నేను మాత్రం ఆ సంఘటనను భ్రమగా వదిలేయలేక కాలనీలో విచారించాను. నా అనుమానం నిజమయింది.

ఓ భగ్నప్రేమికుల జంట కలిసి చేసుకున్న ఆత్మహత్యల పర్యవసానమే వాటి ప్రేతాత్మల సంచారం అని తేలింది." చిన్నగా నిట్టూరుస్తూ ముగించాడు డియస్పీ పకీర్‌నాథ్.

అప్పటివరకు కథలో లీనమైపోయివున్న మిత్రులంతా వాస్తవంలోకి వచ్చారు. ఆ సంఘటనను ప్రత్యక్షంగా తిలకించామా అన్నట్లు అందరి రోమాలు నిక్కబొడిచాయి.

"నిజంగా ఎంత ఆశ్చర్యకరమైన సంఘటన! నువుకాబట్టి ప్రాణాలతో బయటపడ్డావు. అదే మేమయితేనా..." గుండెలరచేతితో రుద్దుకుంటూ అన్నాడు లాయర్ విశ్వనాథ్.

"దయ్యాలున్నమాట ఏమోగానీ, కథకుడిగా మాత్రం గొప్పగా రాణిస్తావోయ్!" వ్యంగ్యంగా అన్నాడు ప్రసాద్.

"ఇక వర్షం తగ్గింది, వెళదామా!" అంటూ లేచాడు చక్రవర్తి.

"మైగాడ్! కథ హడావుడిలో వర్షం తగ్గిన సంగతే గమనించలేదు. గుడ్‌బై ఫ్రండ్స్, మళ్ళీ రేపు కలుద్దాం" అంటూ బయటకు పరుగుతీశాడు ప్రసాద్. అతని కళ్ళముందు భార్య తార ప్రత్యక్షమయింది.

మరుక్షణంలో ప్రసాద్ స్కూటర్ స్టార్ట్ అయింది.

టైమ్ చూసుకున్నాడు ప్రసాద్.

పన్నెండు గంటలవడానికి మరో పావుగంట టైముంది. సరిగ్గా అరగంటకు యింటికి చేరుకోగలడు. తరువాత తార కౌగలి, స్వర్గం గుర్తుకు వచ్చి తనువు పులకించింది ప్రసాద్‌కు.

ఆహ్లాదకరమైన వాతావర్ణం లభిస్తుందనే ఆశతో వూరికి దూరంగా కట్టుకున్నాడు భవంతిని.

సిమెంట్ ఫ్యాక్టరీ దాటగానే నిర్మానుష్యమైపోతుంది రోడ్డు. పచ్చటి పొలాల మధ్య జడల రాకాశిలా పరుచుకుని వుంటుంది తారురోడ్. మున్సిపాలిటీవారి దీపాలు మిణుకు మిణుకుమంటూ వారి ఆర్థిక పరిస్థితిని చాటి చెబుతున్నాయి.

తార గుర్తుకు రాగానే ఆక్సిలేటర్ మరింత బిగించాడు ప్రసాద్. అంకెలో మీటర్ల స్పీడ్‌లోకి పికప్ అయిన స్కూటర్ చటుక్కున సడన్‌బ్రేక్‌తో ఆగిపోయింది.

ఎదురుగా ఓ వ్యక్తి నిలబడివున్నాడు.

అజానుబాహుడూ, సుస్ఫురద్రూపి అయిన ఆ వ్యక్తి తెల్లటి దుస్తులలో హుందాగా నిలబడి వున్నాడు.

"ఎక్స్క్యూజ్ మి సర్! వర్షంలో చిక్కుబడి సిటీబస్ అందుకోలేకపోయాను. నాకోసం యింట్లో ఆందోళనతో ఎదురు చూస్తుంటారు. మీరు వెళ్ళే దారిలోనే నన్ను డ్రాప్ చెయ్యగలరా, ప్లీజ్" ఎంతో వినయం ధ్వనించిందా గొంతులో.

అతను మర్యాదగా అడిగిన తీరును కాదనలేకపోయాడు ప్రసాద్.

"ఎక్కండి" అన్నాడు ప్రసాద్.

అతను 'థ్యాంక్స్' చెబుతూ వెనుక ఎక్కి కూర్చున్నాడు.

గేర్ మార్చి తిరిగి స్కూటర్‌ను పోనిచ్చాడు ప్రసాద్.

టైమ్ చూసుకున్నాడు ప్రసాద్.

సరిగ్గా పన్నెండు గంటలయింది.

చటుక్కున ఫకీర్‌నాథ్ చెప్పిన సంఘటన గుర్తుకు వచ్చింది ప్రసాద్‌కు.

'మై గాడ్! సరిగ్గా యీ టైమ్‌లో వీడెక్కడినుండి వూడిపడ్డాడు? ఖర్మగాలి వీడు మనిషి గాక దెయ్యం కాదుకదా! అసలు స్కూటర్ ఆపుచేయవలసినది కాదు. పోనీ ఆపుచేసినా వెనక ఎక్కించుకోవలసింది కాదు.' తనను తాను నిందించుకున్నాడు ప్రసాద్.

వెన్నులోంచి సన్నగా వణుకు గూడా ప్రారంభమయింది.

వెంటనే ధైర్యం తెచ్చుకున్నాడు ప్రసాద్. 'తాను ఏమాత్రం అధైర్యపడగూడదు. 'అధైర్యవంతుడ్ని త్వరగా వశం చేసుకుంటుంది దెయ్యం' అని విన్నాడు తను. అసలు దెయ్యాలంటే కల్పితమన్నట్లుగా ప్రవర్తించాలి. వీలయితే దయ్యాలను ఖండించాలిగూడా.' అని మనసులో అనుకుంటూ గట్టిగా సకిలించాడు ప్రసాద్.

"మిష్టర్ మీకు దయ్యాలంటే నమ్మకముందా?" డైరెక్టుగా అడిగేశాడు ప్రసాద్ వెనక కూర్చున్నతనిని

ఉలిక్కిపడ్డాడతను. "ఇప్పుడు వాటి ప్రస్తావన ఎందుకులెండి?" అన్నాడు. అతని గొంతులో బెరుకు స్పష్టంగా విన్పిస్తోంది.

ప్రసాద్ అనుమానం మరింత బలపడింది.

"రాస్కెల్! భుజాలు తడుముకుంటున్నాడు." అనుకుంటూ "మరేమీలేదు. దయ్యాలంటే అభూత కల్పనలని యిప్పటివరకు వాదించి వున్నాను. సరదాగా మీ అభిప్రాయం తెలుసుకుందామని" తేలిగ్గా నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

"అలాగా! అయితే దయ్యాలున్నాయని నేను ఘంటాపథంగా చెప్పగలను." అన్నాడు ఆ వ్యక్తి.

అంతే, ఆ మాటకు ప్రసాద్ గుండెల్లో ఎక్స్‌ప్రెస్ రైళ్ళు పరుగుతీశాయి. ఎక్సిలేటర్ మరింత గట్టిగా బిగించాడు.

వెనుక కూర్చున్నతను ఏదో చెప్పుకుపోతున్నాడు.

"సార్, నేను అంత గట్టిగా దయ్యాలున్నాయని ఎలా చెప్పగలుగుతున్నానంటే, నేను ప్రతిరోజూ ప్రత్యక్షంగా చూసే సంఘటన వుంది. మా అక్కయ్య చచ్చిపోయి పది సంవత్సరాలవుతుంది. అప్పటినుండి మా అక్క దయ్యమై మా అమ్మను పట్టుకొని పీడిస్తోంది. రోజూ నేను మా అమ్మలో అక్కయ్య దయ్యాన్ని చూస్తూనేవుంటాను..."

ఆ వ్యక్తి చెప్పే ప్రతి మాట ఒకొక్క పిడిబాకులా దూసుకువచ్చి ప్రసాద్ హృదయాన్ని తాకుతున్నాయి.

"మై గాడ్! వీడు నిస్సందేహంగా దయ్యమే! తను ఏమాత్రం బయటపడగూడదు. అసలు ఆ మాటలుగూడా సాధ్యమైనంతవరకు వినగూడదు. కనీసం వెనక్కుతిరిగి కూడా చూడగూడదు" దృఢచిత్తంతో ఫుల్‌స్పీడ్ పెట్టేశాడు ప్రసాద్.

సరిగ్గా ఎనిమిది నిమిషాలలో ఆ నిర్మానుష్య ప్రదేశాన్నిదాటి జనారణ్యంలోకి వచ్చిపడ్డాడు ప్రసాద్.

ఒక్కసారి గుండెనిండా గాలి పీల్చుకొని చిన్నగా వెనక్కుతిరిగి చూశాడు ప్రసాద్.

వెనకాల ఆ ఆగంతకుడు లేడు.

"థాంక్ గాడ్! తనో పెద్ద ప్రమాదం నుండి బయటపడ్డాడు. లేకపోతే ఆ దయ్యం తనను ఏమి చేసి వుండేదో?" మళ్ళీ ఆ వూహ రాగానే ఒళ్ళు జలదరించింది ప్రసాద్‌కు.

వాచ్‌మాన్ గేటు తెరవగానే రివ్వున స్కూటర్ లోపలకు పోనిచ్చి గ్యారేజీలో పార్కుచేసి పరుగులాంటి నడకతో ఇంట్లోకి ప్రవేశించాడు.

జరిగిన సంఘటనకు ఉద్వేగంలో వొళ్ళు కంపిస్తోంది. ఇంకా గుండె వేగం తగ్గలేదు. భయంతో రొప్పుతున్నాడు. అసలు సమయంలో స్కూటర్‌మీద అంత ధైర్యంగా ఎలా ప్రయాణించ గల్గాడో తనకే అర్థం కావడంలేదు ప్రసాద్‌కి.

"ఏమిటండీ? ఏం జరిగింది?" గాబరాగా ప్రశ్నించింది తార.

జరిగినదంతా ఒక్కసారి ఏకరువుబెట్టి అలసటగా మంచంపై వాలిపోయాడు ప్రసాద్.

"మై గాడ్! శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం" అనుకుంటూ భర్తకు ఎర్రనీళ్ళు దిష్ఠి తీసి తనూ మంచంపై చోటు చేసుకుంది తార.

* * *

"గుడ్‌మార్నింగ్ డాక్టర్! గుడ్‌మార్నింగ్ సర్! గుడ్‌మార్నింగ్" నర్సులు, పేషంట్లు, తోటి డాక్టర్లు అందచేస్తున్న విషెస్‌ను చిరునవ్వుతో స్వీకరిస్తూ తన ఛాంబర్‌లోకి నడిచాడు డాక్టర్ ప్రసాద్.

ఆ రోజు డైరీ తిరగేస్తున్న ప్రసాద్ 'గుడ్ మార్నింగ్ డాక్టర్' అన్న కోకిల కంఠం విని తల పైకెత్తి చూశాడు.

నీలిమ! నర్స్ నీలిమ.

మూడేళ్ళబట్టి చూస్తున్నా రోజూ యింకా చూడాలనిపించేది నీలిమ అందం. ప్రతి మాటలో, ప్రతి చూపులో ప్రత్యేకత కనబడుతుంది నీలిమలో. రోగులతో సతమతమయ్యే ప్రసాద్‌కు గొప్ప రిలీఫ్ నీలిమ సాంగత్యం.

'వాట్ డాక్టర్! రాత్రి మీరసలు నిద్రేపోలేదనుకుంటా?" చిలిపిగా అడిగింది ఎర్రబడిన ప్రసాద్ కళ్ళను చూస్తూ.

"నో నీలిమా! వర్షంవల్ల రాత్రంతా ఒక పార్టీలోనే గడపవలసివచ్చింది." అన్నాడు ప్రసాద్ రాత్రి జరిగిన సంఘటననుండి యిప్పుడే తేరుకుంటున్నాడు. తిరిగి సంఘటనను గుర్తు చేసుకోవడం యిష్టంలేదు ప్రసాద్‌కు. ఒకవేళ ఆ విషయం చెప్పినా నలుగురిలో నవ్వులపాలవడం తప్ప వేరే ఉపయోగం లేదని తెలుసు ప్రసాద్‌కు.

"నీలిమా, గోవిందరావు ఎక్కడ?" అడిగాడు. నైట్ ఇన్‌చార్జి డాక్టర్ గోవిందరావు!

"థియేటర్లో వున్నారు. వెళదాం వస్తారా?" అడిగింది నీలిమ.

"పద." ఉత్సాహంగా కుర్చీలోంచి లేచాడు ప్రసాద్.

లోపలకు ప్రవేశించిన డాక్టర్ ప్రసాద్‌ను చూసి 'హలో' అంటూ విష్ చేసి తిరిగి తన పనిలో మునిగిపోయాడు డాక్టర్ గోవిందరావు.

"వాటీజ్ ది మాటర్?" చేతులకు గ్లోవ్స్ తొడుక్కుంటూ అడిగాడు ప్రసాద్.

"పూర్‌ఫెలో, రాత్రి ఎవర్నో స్కూటర్‌మీద లిఫ్టు అడిగాడట! మరి ఆ స్కూటర్‌వాలా ఎందుకంత స్పీడ్‌గా డ్రైవ్ చేశాడో ఆ భగవంతుడికే తెలియాలి. టర్నింగ్‌లో వెనుక మనిషి క్రిందపడిపోయినా పట్టించుకోకుండా వెళ్ళిపోయాడట! ఆ పడటం ముళ్ళపొదలమీద పడ్డాడట! శరీరమంతా చీరుకుపోయి మూలుగుతూంటే ఎవరో ధర్మాత్ముడు తీసుకొచ్చి యిక్కడ జాయిన్ చేశాడు. ఫ్రాక్చర్ కూడా అయింది. ఆపరేషన్ తప్పనిసరి." నిట్టూరుస్తూ అన్నాడు డాక్టర్ గోవిందరావు.

నిర్ఘాంతపోయాడు డాక్టర్ ప్రసాద్, పేషంటు మొఖం చూస్తూ! 






( గత సంచిక తరువాయి )


























[ఇంకా ఉంది]

# హైదరాబాదు నోట్‌బుక్

## బోగస్ పరీక్షా పత్రాలు !

ఏ కష్టమూ లేకుండా శిబ్బసం దొరకాలని, చిటికెలో చిరయశస్సు ఆర్జించాలని, మంత్రి పదవులు వారసత్వంగా రావాలనీ పెద్దలు కోరుకొంటున్నప్పుడు ప్రశ్న పత్రాలు సంపాదించి పరీక్షలు దాటుదామని విద్యార్థులు భావించడంలో తప్పేముంది? దీక్ష, శ్రద్ధ, పరిశ్రమ, నిజాయతీ స్వాతంత్ర్యం సిద్ధించిన మరుక్షణమే మటుమాయమయ్యాయని తోస్తుంది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఒకమారు పంజాబ్ వెళ్లాను. రైల్లో ఎక్కారు పలువురు భాయీలు టిక్కెట్లు లేకుండా. టిక్కెట్టు ఏదని టికెట్ ఎగ్జామినర్ అడిగితే, దేశం స్వతంత్రమైంది గదా ఇక టికెట్ ఎందుకూ ?— అనడిగారు భాయీలు. ఇదీ స్వాతంత్ర్యానంతరం మనస్తత్త్వం,అన్నిరంగాల లోను. ఏటా పరీక్షా పత్రాలు వెల్లడయినట్లు పత్రికలు ప్రకటించడం, వాటి కోసం విద్యార్థులు చదువులు మాని పాకులాడటం జరుగుతున్నాయి కదా! ప్రభుత్వం ఈ దుస్థితిని అరికట్టడానికి ఏమయినా చర్య తీసుకొందా? ఈసారి కూడ10వతరగతి పరీక్షాపత్రం వెల్లడయినట్లు జంటనగరాలలో పొక్కింది. ఎటు చూచినా విద్యార్థుల పరుగులే. తీరా వాటిలోని ప్రశ్నలు పరీక్ష హాలులో యిచ్చిన ప్రశ్నలతో టాలీ కాలేదని అవి బోగస్ పత్రాలని తేలడం, విద్యార్థుల తలిదండ్రులు, పాలకులు గోలపెట్టడం, జరిగాయి. ఈ బాధ పడలేక విద్యార్థుల తలిదండ్రుల కొందరు ఇలాటి చర్యలు అరికట్టాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఆత్మ విశ్వాసం గల విద్యార్థులు ఇలాటి ప్రలోభాలకు లొంగరు. మొదట్లో చెప్పినట్లు చిట్కా వైద్యం కోరే విద్యార్థులే ఈ విషమ చక్రంలో చిక్కుకుంటారు. స్వార్థపరులు వేస్తున్న యీఎత్తులకు లొంగిపోయి ఉభయభ్రష్టులవుతారు. ఇలాటి కూట ప్రక్రియల కోసం, చీకటి తప్పుల కోసం విద్యార్థి సోదరులు కాలందుర్వినియోగంపరచుకొనక,నియమబద్ధంగా రోజుకు కనీసం గంటసేపు చదివితే ఈనాటి పరీక్షలను సులభంగా దాటవచ్చు. ప్రభుత్వం స్వార్థపరుల ఈ దుశ్చర్యలను అరికట్టాలి. లేక పరీక్షలు రద్దు చేయాలి. లేకపోతే పూర్వపు గురుకుల పద్ధతి ప్రవేశపెట్టాలి. ప్రతివారూ చదువుతారు. ఆయా సంస్థలవారు అర్హులయినవారిని పరీక్షించి తమ తగిన ఉద్యోగాలిస్తారు. పైకి వెళ్లదలచినవారు శ్రద్ధగా చదివి ఉద్యోగార్హులని నిరూపించుకొంటారు. కానినాడు వెనుకబడే ఉంటాడు. శిక్షణ ఇవ్వడం గురువుల, విద్యాసంస్థల పని. ఇన్ని సంవత్సరాలు ఈ విషయంలో శిక్షణ పొందారు అని మాత్రం యోగ్యతా పత్రంలో ఉంటుంది. ఉద్యోగమిచ్చేసంస్థలు వారిని పరీక్షించి తీసుకుంటాయి. శిక్షణ ఇవ్వడంలో అందరికీ సమానావకాశాలుంటాయి. జీవిక కోసం ప్రయత్నించవలసి వచ్చినప్పుడే పరీక్ష. ఆ పరీక్షకూడా అవసరం లేక బ్రతకగలిగితే సరేసరి.

## కొత్త పోలీస్ డైరెక్టర్ జనరల్ :

పోలీసు డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు పదవి విరమణ చేయడం వల్ల ఆయన స్థానే శ్రీ ఎస్. ఆనందరావ్ నియమితులయ్యారు. ఈయన మార్చి 31న పదవీ స్వీకరించారు. శ్రీ ఆనందరాం సికిందరాబాదులోని మహబూబ్ కళాశాలలోనూ నిజాం కళాశాలలోను , చదివి పట్టభద్రుడై మద్రాసు న్యాయ కళాశాలలో పట్టా పుచ్చుకొని 1950లో పోలీసు శాఖలో చేరారు. 1960లో ఇండియన్ పోలీస్‌మెడల్, 1975లో రాష్ట్రపతి పోలీస్ మెడల్ సంపాదించారు. 1971 నుంచి ఆయన హైదరాబాదులోని రిపబ్లిక్ పోర్ట్సులోను, విశాఖలోని హిందూస్తాన్ నౌకా నిర్మాణ కేంద్రంలోను నిజాం షుగర్ ఫ్యాక్టరీలోను ఉన్నత పదవులు నిర్వహించారు. 1980లో ఆయన ఉత్తమ మేనేజర్ అవార్డు పొందారు. పదవీస్వీకరణ వెంటనే ఆయన పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, స్వచ్ఛమైన పరిపాలన తన లక్ష్యమని పోలీసులు నిజమైన పోలీసులుగా వ్యవహరించాలని, పోలీసులు అవినీతికి పాల్పడితే పోలీసు శాఖ గౌరవ ప్రతిష్ఠలు మంటగలుస్తాయి అని ఆయనఅన్నారు. తాను పదకొండు సంవత్సరాల క్రితం పోలీసు శాఖను వదలి ఇతర శాఖలలో పనిచేశానని, మరల తన మాతృ శాఖకు రావడం సంతోషకరంగా ఉందని శ్రీ ఆనందరాం అన్నారు. తాను ఏ రంగంలోను అవినీతిని సహించనని ఆయన మరొకమారు స్పష్టం చేశారు.

### అంధుల కుట్టుమిషన్లు

జపానులో రికార్ కంపెనీవారు అంధులకోసం కొత్తరకపు ఎలక్ట్రానిక్ కుట్టుమిషన్లను తయారు చేశారు జపాను ప్రభుత్వపు వికలాంగుల సంక్షేమ కేంద్రంవారు తమ సహకారాన్ని అందించారు. ఈ కుట్టుమిషన్లో తనంతట తానే దారం అమర్చుకునే సూది, స్విచ్ బటన్, అంధులకు అవసరమైన యితర ఏర్పాట్లు వుంటాయి. టోక్యోలోని హెలెన్ కిలర్ అసోసియేషను వారు దీనిని మార్కెట్లో ప్రవేశ పెడుతున్నారు.

## తారకరాముని విజయ పతాక !

శ్రీ ఎన్. టి. రామారావు తమ తెలుగుదేశం పార్టీని సీసపు మూలబంధంపై స్థిరపరచడానికి గట్టి చర్యలు ప్రారంభించారు. తమ పార్టీ పతాకను ఆయన ఏప్రిల్ 1 వ తేదీన ముషీరాబాద్‌లోని రామకృష్ణ స్టూడియోస్‌లో జరిగిన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో వివరించారు. ఈ గోష్ఠి గంటకు పైగా జరిగింది. పార్టీ పతాక పసుపు పచ్చది. దాని మీద మధ్యన ఎర్రరంగులో చక్రం ఉంటుంది. ఇదిపారిశ్రామిక ప్రగతికి చిహ్నం. దాని మధ్యన ఆకుపచ్చ రంగులో నాగలి ఉంటుంది. ఇది పాడిపంటలకు చిహ్నం. ఈ రెండింటి మధ్య తెలుపు రంగులో గుడిసె ఉంటుంది. ఇది నిరాడంబర జీవితానికి, పవిత్రతకు సంకేతం. పసుపు రంగు పతాక త్యాగానికి చిహ్నం. తెలుగువారంతా ఒక్కటే గనుక, వారు ఐకమత్యంతో ఉండి తమ భవిష్యత్తును తీర్చిదిద్దుకోవాలనే సంకల్పంతో తాను తన పార్టీకి 'తెలుగుదేశం' అని నామకరణం చేశానని, రెండు విచ్ఛిన్నకర ఉద్యమాలు తెలుగుదేశాన్ని కలుషితం చేశాయని, అలాటివి మరి జరగకుండాతెలుగువారు అఖండ జాతిగా ఉండడానికే తన ప్రయత్నమని శ్రీ రామారావు వివరించారు. ప్రాంతీయ ప్రయోజనాల పరిరక్షనే తన పార్టీ లక్ష్యమని, అల్ప సంఖ్యాకుల హక్కులను కాపాడుతామని ఆయనఅన్నారు. "ప్రజలపై మాకుసంపూర్ణ విశ్వాసముంది. మేము ఇంటింటికీ వెళ్లి వోట్లు అడుగుతాం. ముఖ్యంగా మా కార్యకర్తలు ప్రజాసామాన్యం వద్దకు వెళ్లి వోట్లడుగుతారు" అని ఆయన అన్నారు. తమ పార్టీకి కార్మిక, యువజన, విద్యార్థి, మహిళా విభాగాలు ఉంటాయని, విద్యార్థులు రాజకీయ నాయకుల చేతిలో విధ్వంసక శక్తులుగా ఉపయోగపడడం తనకు యిష్టం లేదని, విద్యార్థులు చదువు పూర్తయిన పిదప రాజకీయాలలో ప్రవేశించడం ఉచితమని, ఆయన అన్నారు. శ్రీ రామారావు ఈ గోష్ఠిలో ఇతర పక్షాలపై విసుర్లు, చెణుకులు వేయడంగాని, వ్యక్తిగత నిందలకు దిగడంగాని చేయలేదు. అలాటి ప్రశ్నలకు ఆయన చాల నిబ్బరంతో సముచితమయిన సమాధానాలిచ్చారు. తమ పార్టీ లక్ష్యాలను వివరించడం తప్ప మరొక న్యూసుకు పోలేదు. తమ పార్టీ ఎన్నికలకు ఎప్పుడూ సిద్ధమేనని , అన్ని స్థానాలకు పోటీ చేస్తామని ఆయన అన్నారు.

## ఉపశ్రుతి :

'ఏం సార్, ఎన్. టి. రామారావు చలనచిత్ర రంగములో పెద్దవాడే కాని, ఇతరపార్టీల ఎత్తులకు తట్టుకొని, గెలిచి అధికారానికి వాస్తాడంటారా ?' అనడిగారు ఒక ఎన్. టి. ఆర్. అభిమాని నన్ను. పొరుగు రాష్ట్రంలో సినిమా వారిదేగా రాజ్యం ? అంతెందుకూ, అమెరికా అధ్యక్షుడు సినిమా వాడే కదండీ ! అన్నారు మరొక సినీ ప్రేక్షకుడు.

—తిరుమల రామచంద్ర

# గతుకుల బాట




'మే ఐ కమిన్ సార్'

మృదువుగా అడిగింది డాక్టరు శారదాదేవి. ఆ రోజుకి తన పని పూర్తి చేసుకొని ఇంటికి వెళ్ళబోతూ మందుల బీరువాకు తాళం వేస్తున్న శ్రీధర్ ఆమె స్వరాన్ని గుర్తుపట్టాడు.

'ఓ మిసెస్ మూర్తిగారా! రండి రండి' అన్నాడు.

శారదాదేవి హృదయం ఒక్కక్షణం కంపించింది.

'నన్ను పలకరించడానికి కూడా మూర్తిగారి పేరే ఉపయోగించాలా? నాకూ ఓ పేరుంది' అంది గంభీరంగా.

ఆ మాట ఎందుకన్నది అర్థం కాలేదు డాక్టర్ శ్రీధర్‌కి. ఏదో ఛలోక్తికి అంటోందేమో అని సరిపెట్టుకున్నాడు

శారదాదేవి లోపలకు వచ్చి కూర్చోగానే ఆమెకు ఎదురుగా ఉన్న కుర్చీలో తను తిరిగి

కూర్చుంటూ, 'ఈ మాట ఇపుడు నేను క్రొత్తగా అంటున్నది కాదు. వివాహిత అయిన స్త్రీని అలా పిలవడం పరిపాటేగా మిస్ మూర్తి' కొంటెగా చూస్తూ అన్నాడు.

మళ్ళీ అదే సంబోధన వినేసరికి ఆమె మనసు పట్టరాని ఆవేశంతో ఊగిపోయింది. ఆ ఆవేశం కనులలో ప్రతిఫలిస్తూ ఉండగా అంది. "శ్రీధర్‌గారు కొన్ని పరిపాటేఅయినా అది పొరపాటు అని నా అభిప్రాయం. ఇలాటి సంప్రదాయాలే స్త్రీజాతిని అణగద్రొక్కేది! ఆమెకు బానిసత్వాన్ని మిగిల్చేది?" ఈ రోజు శారదాదేవి ఎందుకలా మాట్లాడుతున్నది శ్రీధర్‌కి అంతుచిక్కలేదు. తగిన కారణం ఏదో ఉండి ఉంటుందని మాత్రం ఊహించాడు. శారద మనస్సు అతి సున్నితమైనది. ఆమెతో అతనికి పది సంవత్సరాల పరిచయం ఉంది. వారిది అతి గాఢమైన స్నేహసంబంధం. అతి సున్నితమైన శారద మనస్సు ఎందుకో తీవ్రంగా గాయపడి ఉంటుంది. లేకపోతే ఇలా ఎందుకు మాట్లాడుతుంది? నెమ్మదిగా చల్లని మాటలతోనే ఆమె మంచి విషయాన్ని తెలుసుకోవాలి అనుకుంటూ మళ్ళీ మాట్లాడడానికి ఉపక్రమించాడు.

"శారదా విన్నాక మాట అడుగుతాను. ఏమీ అనుకోవుగా?" అన్నాడు ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

'తప్పకుండా' అంది ఆ చూపుల్ని తప్పించుకుంటూ.

'తీరా అడిగేక నా స్వవిషయాలు నీ కనవసరం అనకూడదు సుమా.'

'అనను శ్రీధర్, అలా ఎప్పటికీ అనను. ఈ రోజు నా మనస్సులో బాధంతా నీతో చెప్పుకోవాలనే ఇలా వచ్చాను.'

ఆమె ఇంతసేపు చూపించిన గంభీరమంతా మాయం అయిపోయింది. ఆమె చూపులో దైన్యం చోటు చేసుకుంది.

'చెప్పు శారదా, నువ్వెందుకో తీవ్రంగా బాధపడుతున్నట్లు ముందే నేను గ్రహించాను. చెప్పు మరి ఆ వేదన ఏమిటో' తన కుర్చీని ఆమెకు దగ్గరగా లాక్కుని మరింత లాలనగా అన్నాడు.

శ్రీధర్ అంత లాలనగా అడిగేసరికి శారదాదేవి ఇక దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

'అదేమిటి శారదా. ఏమిటా కన్నీళ్ళు? నువ్వే ఇలా బేలవైపోతున్నావా?'

'లేదు. లేదు శ్రీధర్. నేను ఎన్నటికి బేలను కాను. కాకూడదనదే నా తీవ్ర ఆకాంక్ష' కన్నీరు తుడిచేసుకుని మళ్ళీ ముఖంలోకి గాంభీర్యం తెచ్చుకుంది.

"నువ్వు నాకో సహాయం చేయాలి."

'ఏమిటది?'

"అదే పరిహాసంగా మీరు నాతో అన్నదే. ఆ మాట నిజం చెయ్యాలి"

శ్రీధర్‌కు ఏం గుర్తు రాలేదు. 'నే నేమన్నాను?' అమాయకంగా అడిగాడు.

'అదే ఏదో గిరిజన ప్రాంతానికి ట్రాన్స్‌ఫరు చేస్తాను. వెళ్తావా? అన్నావుగా. అదే ఇప్పుడు మీ నుంచి కోరుకుంటున్నాను.'

శ్రీధర్ ఆశ్చర్యపోయాడు. 'ఆ కొండ ప్రాంతంలో నువ్వేం సుఖపడగలవు? పెద్ద ప్రొప్రయిటరుగారి భార్యవి. నిజానికి నీకు ఉద్యోగం చేయవలసిన అవసరం లేదు. నీ చదువు సార్ధకత కోసం ఉద్యోగం చేస్తున్నావుగాని.'

'ప్లీజ్ అలా మాటాడకండి. మూర్తిగారి హోదా, ఆయన ఆస్తి వీటితో నా జీవితం ముడిపడి వుండకూడదు. నా జీవితం నాది కావాలి. నా బిడ్డల బ్రతుకు బాట నేనే ఏర్పరుచుకోవాలి. అందుకు నాకు ఉద్యోగం చాల అవసరం. మీ నుంచి నేను కోరిన ఈ సహాయం మీరు చేయటం అంతకన్నా అవసరం.'

శారద ధోరణి శ్రీధర్‌ను మరింత ఆశ్చర్యపరచింది అయోమయంగా ఆమె కళ్ళలోకి చూస్తుండిపోయాడు. ఆ కళ్ళు ఏదో దృఢ సంకల్పాన్ని వ్యక్తం చేస్తూ దీప్త జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి.

'నా జీవన మార్గంలో అవరోధాలుగా బండరాయి లాంటి అతని హృదయం, పల్లేరు కాయల్లాంటి అతని ధనం ఉండటానికి వీల్లేదు.'

'ఏమిటి శారదా నువ్వంటున్నది? తొందరపడి ఇలాటి నిర్ణయాలు తీసుకోవటం అంత మంచిది కాదు.'

'నీకు తెలియదు శ్రీధర్. తొందరపాటని ఆలోచిస్తూ కాలం కరగించేయటం అవివేకం అనిపించుకుంటుంది. నా పిల్లల భవిష్యత్తు దృష్టిలో ఉంచుకుని నేనీ నిర్ణయానికి రాక తప్పలేదు డబ్బులోనే సుఖముందని, భర్తకు దూరమైన స్త్రీ జీవితం అగచాట్ల పాలవుతుందని ఆత్మవంచన చేసుకుంటూ పోతే పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుంది'

'అందుకని ఒంటరి బ్రతకటానికి నిర్ణయించుకున్నావా? బాగా ఆలోచించుకో శారదా! ఏలాగైనా సర్దుకు పోవటానికి ప్రయత్నం చెయ్యి, అతనే దారికి రావచ్చు.'

'అది అసంభవం శ్రీధర్. ఆ యింట పెరిగితే పిల్లలు మంచి పౌరులుగా తయారు కాలేరు అతని నీడలో నే నుంటే వాళ్ళని ఉన్నతులుగా తీర్చిదిద్ద లేను అతని సంస్కారం పిల్లల మీద ప్రతి ఫలించక తప్పదు.'



'పారిపోతున్నావు. మట్టిలోనే బ్రతుకుతూ తన శరీరానికి మాలిన్యం సోకకుండా బ్రతికే కుమ్మరి పురుగుని చూడలేదూ నువ్వు? అలానే అతనితో కలిసి జీవిస్తున్నా, ఆ చిన్న ప్రాణిని ఆదర్శంగా తీసుకుని తల్లిగా నీవు కోరుకున్న రీతిలో నీ బిడ్డల్ని తీర్చిదిద్దు.'

'అదీ అసాధ్యమే. మా మార్గాలు ఎప్పటికీ కలియవు. మూర్తిలో ఇక ఏలాటి పరివర్తనా రాదు. నేను ఆశించటం లేదు కూడా. మేం విడిపోతేనే పిల్లల భవితవ్యానికి మంచిది'

పదేళ్ల క్రితం ఎంతో ఉత్సాహంగా అందం, ఆనందం, చదువు ముప్పేటల హారంగా ధరించి, తన మనస్సును ఆకట్టుకొని ప్రాణ స్నేహితురాలైన శారదకు, ఇప్పటి శారదకు అసలు పోలికఉందా? అనిపిస్తుంది. ఇద్దరి మధ్యా అరమరికలు లేని స్నేహం, ఏ చిన్న విషయమైనా ఒకరితో మరొకరు సంప్రదించుకొనేవారు. ఏలాటి అభిప్రాయాలైనా నిస్సంకోచంగా వెలువరించుకొనేవారు. శారద తనకు పరిచయమైన కొద్ది కాలానికే ఇద్దరి మధ్య ఎంతో సాన్నిధ్యం ఏర్పడిపోయింది ఒకే కాలేజీలో చదవక పోయినా, డాక్టరు పట్టా తీసుకొని తనకు బాగా కావలసిన డాక్టరు రామనాథం దగ్గరకు అసిస్టెంటుగా వచ్చింది. అప్పటికే రెండు సంవత్సరాలుగా అతని దగ్గర అసిస్టెంటు పర్మనెంటుగా ఉంటున్నాడు తను. రామనాథం గారే శారదను తనకు పరిచయం చేసేరు. అప్పుడు అతనన్న మాటలు ఇప్పటికి తను

# గతుకుల బాట

మరచి పోలేదు 'చదవటమైతే శారద ఈ చదువు చదివిందిగాని ఉత్త అమాయకురాలు. పువ్వులాంటి మనసు నా మేనకోడలికి నువ్వే ఈ వాతావరణాన్ని అలవాటు చేయించి ఈ వృత్తిలోని మెళకువలే కాక జీవితానికి ఉపకరించే ఎన్నో విషయాలు నీ స్నేహంలో శారద నేర్చుకోవాలి.' ఆమాటలు విన్న క్షణం రామనాథం తన పైన ఏదో బాధ్యత మోపినట్టు అనిపించింది. అందుకే ఈనాడు ఇంతగా గుర్తు వస్తున్నాయి ఆ మాటలు. కాని శారద ఇప్పుడు తన సలహా పాటించేలా లేదు. ఆమె నిశ్చయం దృఢ నిశ్చయంగా ఉంది. శారద భర్త నుంచి వేరు పడి తీరుతుంది. ఎందుకు ఇంతగా మనస్సు మార్చుకుందో! అసలు శారదకు సాంసారిక జీవితం పట్ల ఎంతో కుతూహలం. తన భర్త ఇలా ఉండాలి, అలా నడుచుకోవాలి అని ఎన్నెన్నో ఊహాలల్లుకుంది. అందగాడు, ఆస్తిపరుడు అయిన మూర్తి తనను చేపడతానన్నప్పుడు ఆమె ఆనందం అవధులు దాటింది. అందమైన మూర్తిలాగే అతని హృదయాన్ని ఊహించుకొని మురిసిపోయింది. ఎంతటి సంపన్నుడో అంతటి సంస్కారవంతుడని సంబర పడింది. మిన్నంటిన ఆమె సంబరాన్ని చూస్తూ తను అడిగాడు –

'శారదా ఈ రోజు నిజంగా నీలో ఇంత ఆనందాన్ని చూడగల్గుతున్నాను. ఎంతో కాంతివంతంగా వెలిగిపోతున్న నీ ముఖం చూస్తూంటే నిజంగా స్త్రీ జన్మ సార్థకత అదేనేమో అనిపిస్తోంది. ఏమంటావు?'

శారద చిరుసిగ్గులు, సిరినవ్వులు కలగలిపి ఒలకపోసింది అందులోనే అతనికి సమాధానం దొరికింది. కాని అతని ప్రశ్నకు జవాబు చెప్పటంకోసం ఆమె గులాబీ పెదవులు విచ్చుకోమా విచ్చుకున్నాయి.

"అవును శ్రీధర్. స్త్రీ హృదయాన్ని నువ్వు బాగా అర్థంచేసుకున్నావు. రోగుల మధ్య బాధ్యతల బరువుతో, గుండెదడ దడలను మాత్రమే తెలియజేయ గలిగే స్టెతస్కోపు చేరువలో, కత్తులమధ్య కాలాన్ని కరగించుకొనే ఈ అమూల్య పదవికి తగిన అలంకరణ కంటె పతిదేవుని సన్నిధిలో ఆదర్శ గృహిణిగా, అచ్చమైన భారతీయ వనితలా, మమతల పందిరి అల్లుకోవటమే వాకిట్లో వలపు విరులు విరబూయటమే నా జీవిత పరమార్థం" అంది.

అలా భావించే శారద ఇప్పుడు అందుకు పూర్తిగా భిన్నమైన మార్గాన్ని ఎలా అవలంబించాలనుకుంటోంది? అలా ఆలోచిస్తూ ఉండిపోయాడు శ్రీధర్. శారదాదేవి మనస్సులో కూడా ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

నిజమే! తన నిర్ణయం శ్రీధర్‌ని ఆశ్చర్య పరచటంలో అర్థంలేకపోలేదు. తను ఎన్ని ఆశలతో, ఎంతో ఆనందంగా తన దాంపత్య జీవనంలో అడుగుపెట్టిందో, తెలుసు శ్రీధర్‌కి. భర్తని దైవంగా భావిస్తూ, ప్రణయ జీవనమే పరమార్థంగా ఎంచుకున్న తను ఇలా ప్రవర్తించటం శ్రీధర్‌కి కొంత కలవరం కూడా కలిగించి ఉంటుంది. కాని, తనీ నిర్ణయానికి రావటానికి ఎన్ని బలమైన కారణాలు ఉన్నాయి. అవన్నీ తను ఇలాంటి నిర్ణయం తీసుకోవటం తప్ప మార్గాంతరం లేదని గట్టిగా చెప్తున్నాయి. నిన్న మొన్నటి దాకా జరిగిపోయిన ఎన్నెన్నో సంఘటనలు ఒక్కొక్కటే ఆమె కళ్ళముందు కదలాడుతున్నాయి. ధనస్వామినన్న అహంకారం తప్ప, మూర్తి హృదయంలో అనురాగమే లేదు. అతను తనను పెళ్ళిచూపులలో చూసిన కొద్ది సేపట్లో తనీ విషయాన్ని ఎలా అర్థం చేసుకోగలదు? అది తనకు అవగతమయ్యే సరికి కొన్ని సంవత్సరాలే పట్టింది. అప్పటికే తను ఇద్దరు పిల్లల తల్లి అయిపోయింది. అహర్నిశలూ తన వ్యాపార కార్యాలలోనే



5 కిలోల బరువుగల పుస్తకాలను స్కూలుకు మోసు కెళ్ళటం ఒక్కటే ఈనాడు పిల్లలకు అతి తేలిక పనిగా కనబడుతోంది..



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమ మైనవి లభించాలి.

దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్.

మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు రుచికరమైన బూస్ట్ ఇవ్వండి. రోజంతా అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి లభిస్తుంది. ఎందుచేత నంటే, బూస్ట్ అతి నాణ్యమైన పదార్థాల మేలిమితో నిండి ఉంది. మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్, కోకో.

ఉత్తమ మైనవి ఎన్నడూ చవకగా దొరకవు. బూస్ట్ కూడా అంతే.

కాని మీరు ఖర్చు తక్కువని

నాని




**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

HTP-HMM-7237

## గతుకుల బాట

నిమగ్నుడైన మూర్తి నుంచి తను ఏనాడూ కోరుకున్నరీతిలో ప్రేమ పొందలేక పోయింది. తొలిసారిగా తను అతనితో అంది 'ఇంతగా పనుల ఒత్తిడితోనే మునిగిపోతే ఎలాగండీ? మన ముచ్చటలు ఎలా తీరాలి? జీవిత మాధుర్యాన్ని చవిచూసేదెప్పుడు?.'

మూర్తి అదోలా నవ్వాడు 'అందరికీ చేదు మందులు పంచిపెట్టే నీకు మాధుర్యం తెలుసా? నన్నడిగితే మాధుర్యం మధువు లోనే ఉందంటాను. విలాసంగా జీవించాలంటే లెక్కలేనంత డబ్బు కావాలి అది నాకు ఉంది కాని, ఇంకా ఇంకా కావాలి! అందుకే నేను ఎంత సమయమైన వెచ్చిస్తాను డబ్బుతో కొనగలిగే సుఖాలన్నీ కొనుక్కుంటూ జీవితాన్ని గడిపేస్తాను." అన్నాడు.

"అంతేనా? మీరు నానుంచి ఏమి కోరటం లేదా?"

"ఎందుకు కోరటంలేదు? నా తోవకు నువ్వూ, నీ పిల్లలు అడ్డురాకూడదు అదే నీనుంచి నేను కోరేది!"

తను ఆ మాటలకు నిశ్చేష్టురాలయింది. 'అయితే పెళ్ళెందుకు చేసుకున్నారు?' అప్రయత్నంగా అడిగేసింది.!

మళ్ళీ అతడు చిద్విలాసంగా నవ్వాడు. 'పరేలేవోయ్ పెళ్ళనేది నా దృష్టిలో ఓ సాంఘిక మర్యాద! అంతే అయినా ఇప్పుడు నీకేం తక్కువయింది? అప్పుడప్పుడు నేను నీకు భర్త అందివ్వవలసిన సౌఖ్యాన్ని అందిస్తున్నానుగా."? మూర్తి అలా అనే సరికి తనలో సహనం నశించింది.

"ఛీ మీతో మాట్లాడడం నాదే పొరపాటు. ఇలాంటి భావాలు మీలో జీర్ణించుకొని ఉన్నాయని మీ ప్రవర్తన వల్లే తెలుస్తోంది" అనేసింది. 'పెళ్ళిచేసుకోవటం అతనిదృష్టిలో సాంఘిక మర్యాద? అయితే, అతనితో కలిసి, తను ఆ సాంఘిక మర్యాద కోసమే జీవించక తప్పదు' అనుకున్న తర్వాత భర్తతో తను ఎలాంటి వాదులాటకు దిగలేదు. నిర్లిప్తంగా రోజులు గడిపేయటం అలవరచుకుంది. కాని, మనసుమాత్రం మోడువారి పోయింది. ఆ మోడు మరోరకం చిగురులు తొడిగింది. ఆ చిగురులే తన చిన్నారు లిద్దరూ! 'తల్లిగా తను పొందుతున్న

### నా య కు లు

వెండితెరపై
నటిస్తే —
కథానాయకుడు.
ప్రజల ముందు
నటిస్తే
ప్రజానాయకుడు.
ఒకడు ఎన్నో
పాత్రలు పోషించే మేటి.
మరొకడు —
ఎన్నెన్నో పార్టీలు
మార్చే ఘనాపాటి.

### ప్ర జ లు

అవసరమొస్తే
దేవుళ్ళు వీళ్ళే—
అవసరం తీరాక
ఆటబొమ్మలూ వీళ్ళే !

— పసుమర్తి పద్మనాభన్

ఆనందం, వాళ్ళ జిలిబిలి పలుకులలో, లేత నవ్వులలో, చిలిపి చేతలలో, తమ అనుభవిస్తున్న తృప్తి, ఇవే చాలు తన జీవితానికి !' అనిపించసాగింది శారదకి.

కాని, అలా ఎంతోకాలం సంతృప్తి పొందలేక పోయింది. మరోరకం సమస్య ఆమెకు ఎదురైంది. పిల్లలిద్దరికి కొద్దిగా ఊహ తెలిసి నప్పటినుంచి, "అమ్మా! నాన్న రోజూ ఎందుకు ఇంటికిరారు ? వచ్చినా, మమ్మల్ని ముద్దులు పెట్టుకోరేం ? నీలా మాతో ఆడుకోరేం ? అందరి నాన్నలూ, అమ్మలూకూడా ఎంతో సరదాగా ఉంటారు. నాన్నకి మేమంటే కోపమా?" అని అడగటం మొదలు పెట్టేరు.

"కాదమ్మా ! కాదు ! నాన్నకి మీరంటే కోపంలేదు. అతనికి మన అవసరమే లేదు. మెత్తగా డబ్బుంది. ఆ వాణేలి ఫలాలకు ఆశించే అందమైన రామచిలుకలు ఆ పంజరంలోకి వస్తాయి. ఇక మనతో పనేం ఉంది ?" ఆమె మనసు మూలిగేది. ఆ పసివాళ్ళకు మాత్రం ఎలాంటి సమాధానం చెప్పలేకపోయేది.

అలాటి ఓ రామచిలుక సరాసరి ఆ ఇంటిలోకి ఎగిరివచ్చింది. ఆ చిలకతో తన గోరింక సాగించే ప్రణయకేళి మాత్రం తన మనస్సును పూర్తిగా కలచివేసింది. మళ్ళీ మూర్తితో ఘర్షణ పడకుండా ఉండలేక పోయింది "ఏమిటిది ? పెళ్ళంటే సాంఘిక మర్యాద అన్నారే, మరి ఆ మర్యాద మీరటం కమించటం కాదా ?". మూర్తి మాటే మూర్తికి అప్పచెప్పాను అనుకుంది. కాని, మూర్తి తేలికగా నవ్వేస్తూ, "నీ నుంచి నాకు సరియైన కంపెనీ లభించలేదు. అయితే నీ వృత్తి , నీ పిల్లలు ఇవి తప్ప ఇంకేం అక్కరలేదు నీకు ! అందుకే నాకు మరో తోడు కావాలనిపించింది". అన్నాడు.

'నావల్ల మీరు పొందలేక పోయిందేమిటి? కాకపోతే మీరు జీవిత మాధుర్యం అంతా ఇమిడి ఉందనుకొనే మధువు, ఆ రకం అలవాట్లు నేను సహించలేను. అంతే"

'చాలు ! అది చాలదూ ! నా మనస్సుకు నచ్చి, నా కోరికలు తీర్చగలిగే మరో యువతిని అందుకే నేను తెచ్చుకున్నది.'

అంత నిష్కర్షగా మూర్తి మాట్లాడుతుంటే ఇంకా తను అతనితో వాదించి ప్రయోజనం లేదనుకుంది.

తనలో తనే ఆలోచించుకొని ఒక నిశ్చయానికి వచ్చింది. ఇలాగే అంటీ అంటనట్టు మూర్తితో కలిసి ఉంటూ కాలం గడపటం ఇంక అసాధ్యం. అలాగే జరిగితే పిల్లలిద్దరూ కూడా పెడత్రోవ పడతారు. అతని భావాలే వాళ్ళూ అలవరచుకుంటారు. ధనగర్వాన్ని పెంచుకుంటారు. నిరాడంబరంగా, నిర్మలమైన మనస్సుతో, తన చిరంజీవులు పెరగాలంటే ఈ పసితనంలోనే వాళ్ళని ఈ వాతావరణంనుంచి పూర్తిగా దూరం చేసేయాలి! ఇలా గట్టిగా తీర్మానించుకొని, తను ఈ రోజు శ్రీధరును కలుసుకుంది. కాని, అతను తన నిశ్చయాన్ని ఆమోదించేటట్లు లేదు. ఏలాగయినా, నచ్చచెప్పి తన మనస్సుని మళ్ళించాలను కుంటున్నాడు అలా మాత్రం జరగటానికి వీల్లేదు. తన ఆలోచనల్లోంచి తేరుకుని, వాస్తవంలోకి వచ్చింది శారదా దేవి !

"ఏమిటి శ్రీధర్‌గారూ ! అలా మౌనంగా ఉండిపోయారేం ? నాకు మీరు ఈ సహాయం చేయదలచుకోలేదా. ?"

శ్రీధర్ ఉలిక్కి పడ్డాడు ! "అలా అని కాదు శారదా ? ఎంత ఆలోచించినా నువ్వు తొందర పడుతున్నావేమో అనిపిస్తోంది. నాకు.!"

"లేదు శ్రీధర్‌గారూ! నేను చాలాకాలంగా మీతో మనస్సువిప్పి మాటాడలేకపోతున్నాను. నా సంసార జీవితంలోని ఒడిదుడుకులు మీదాకా రానివ్వటం ఎందుకని ఊరుకున్నాను. నేను క్షణం క్షణం అనుభవించే మనోవ్యధతో కుమిలిపోతున్నాను. నా బతుకునైతే ఉద్వేగాలను గాని, కన్నపిల్లల భవిష్యత్తును నాశనం చెయ్యలేను. వాళ్ళ కోసమే నేనిలా చేయాలనుకుంటున్నది" అంటూ తన మనస్సులోని అలజడినంతా శ్రీధర్ ముందు వెలువరించింది శారదా దేవి !

శ్రీధర్ విస్తుపోయి కూర్చున్నాడు. 'ఇక ఇప్పుడు చెప్పండి. నేను ఈ నిర్ణయానికి








— బులుసు వేంకటరమణయ్య

# త్రిమూర్తుల గుణచిహ్నాలు

నిర్గుణమైన పరబ్రహ్మ సృష్టి మున్నగు కార్యములు నిర్వహించడం కోసం త్రిమూర్తులుగా అవతరించినట్లు మన పురాణాలు చెప్తూ ఉన్నవి. ఆ త్రిమూర్తులే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. వారు క్రమంగా సత్త్వరజస్తమో గుణాలు కలవారు.

బ్రహ్మ సృష్టిని చేసే బాధ్యతను వహించాడు. సత్త్వగుణ వర్ణం శ్వేతం. అందువల్ల అతని వాహనమైన హంస తెల్లనిది. విద్యాధి దేవత అతని భార్య సరస్వతీదేవి శ్వేతవర్ణ. అతని నాలుగు ముఖాల నుంచీ వెలువడిన నాలుగు వేదాలు విజ్ఞాన చిహ్నాలు. నీరక్షీరాలను (మంచి చెడ్డలను) వేరు చేసే శక్తి అతని హంస వాహనానికి వున్నది. ఒకచోట స్థిరంగా కూర్చుని సృష్టి చేసి అతడు తన బాధ్యతను నిర్వహిస్తూ ఉంటాడు.

బ్రహ్మ సృజించిన మానవాది జీవులను పాలించడం, పోషించడం విష్ణుదేవుని పని. అది రజోగుణ ప్రధానమైనది. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ ఆయన చేసే పనులు. ఈ పనులు సామ్రాజ్యాన్ని పాలించే రాజులు చేస్తారు. వారు మహాభోగాలు అనుభవిస్తారు. భోగానుభవానికి సంపద కావాలి. లక్ష్మీదేవి విష్ణుదేవుని భార్య అగుట వల్ల సంపదకేమీ లోపం ఉండదు. పీతాంబరాలకూ, సుగంధాను లేపనాలకు, రకరకాల పుష్పమాలలకు లోపం ఉండదు. ప్రభువుకు ప్రజలపై ఎక్కువ వాత్సల్యం ఉండాలి. విష్ణువు వాత్సల్యానికి పెట్టినది పేరు. ఆయన శంఖ చక్రాలు, వరదాభయాలు శిక్షణ రక్షణలకు సూచకాలు.

సంహార కర్త అగు రుద్రుడు తమోగుణ ప్రధానుడు. అతని వేషం భీకరంగానే ఉంటుంది. మూడవదైన అగ్నినేత్రం, నాగభూషణాలు, కపాలం, పునుక పూసల పేర్లు, గజచర్మ వస్త్రం— అన్నీ భయాన్ని కలిగించేవే!

పుట్టినది వృద్ధి పొందడం, కొంత కాలానికి నశించడం స్వాభావికం. అందువల్ల ఈ మూడు పనులూ త్రిమూర్తులు పంచుకున్నారు. అయితే ముగ్గురూ భక్తుల యెడల వాత్సల్యంకలవారే! ఎవరిని సేవించినా తగినఫలం లభించగలదని ఆస్తికుల అభిప్రాయం.

---

రావటం, పొరపాటంటారా ?— అనలేరు ! ! నాకు తెలుసు. నేను మూర్తిగారి నుంచి దూరం అయి నా స్వశక్తితో, నా పిల్లల్ని పెంచుకొని ఉత్తమ పౌరులుగా దిద్దుకుంటాను. ఇప్పటికే వాళ్ళు ఈ సుఖాలకు అలవాటు పడి పోతున్నారు. ఎంత త్వరగా నేను కోరుకుంటున్నట్లు జరుగుతే అంత మంచిది'' అంది శారద.

"నువ్వంటున్నది నిజమే గాని శారదా! అప్పుడు మరోరకం సమస్య ఎదుర్కోవలసి వస్తుందేమో ? ఆ విషయం కూడా ఇప్పుడే ఆలోచించుకోవాలిగా ! కేవలం పిల్లల కోసమే ఆలోచిస్తే భర్తను వదిలేసిన స్త్రీగా ఈ సమాజంలో నువ్వు చులకనై పోవూ ?''

శారదాదేవి పేలవంగా నవ్వింది. "ఇలాటి భయంతోనే ఎంతో మంది తను బ్రతుకునే కాక పిల్లల భవిష్యత్తును కూడా చేతులారా నాశనం చేస్తున్నారు. ఒక్కమాట చెప్తాను వినండి శ్రీధర్‌గారూ ! తల్లిదండ్రుల మధ్య సరైన అవగాహన లేక అభిప్రాయభేధాలతో, చీటికీ, మాటికీ' కీచులాడుకునే ఇంట పుట్టి పెరిగిన పిల్లలే దేశద్రోహులుగా, హంతకులుగా, దొంగలుగా, మరెన్నో దుష్కృత్యాలు చేసేవారుగా తయారవుతున్నారు. నా పిల్లల విషయంలో అలా జరగటానికి వీల్లేదు.''

## గతుకుల బాట

'ఎంత తీవ్రంగా ఆలోచించావు శారదా! నేనే కాదు నీ అభిప్రాయం ఎవరూ కాదనలేరు. నువ్వాశించినట్లే జరుగుతూందిలే!' అన్నాడు శ్రీధర్.

శారదాదేవి మనస్సు తేలికపడింది.

* * *

తను కోరుకున్న గమ్యం చేరుకోవటానికి శారదాదేవి పిల్లలిద్దరితో రైల్లో ప్రయాణం చేస్తోంది.

'అమ్మా! మన వూరు ఎప్పుడొస్తుంది!' కుతూహలంగా అడిగాడు బాబు.

'వచ్చేస్తుంది లే ఈ రాత్రికల్లా మనం మన ఊళ్ళోనే ఉంటాం —' 'అక్కడ ఎవరుంటారు?' అమాయకంగా అడిగింది పాప.

'మనింట్లో మనం ముగ్గురమే ఉంటాం.'

ట్రైను దిగిన తర్వాత ఉన్న కొద్ది సామానుతో ప్లాటుఫారము మీదికి రాగానే మళ్ళీ బాబు ప్రశ్నలు వేయటం మొదలు పెట్టాడు. "మనల్ని తీసుకు వెళ్ళటానికి కారు రాలేదేం? ఈ రిక్షాలో ఎక్కిస్తావా! ఏమిటి ?''

"అవును బాబూ! పెద్ద పెద్ద ఆ కార్ల కన్నా చిన్న రిక్షాలే ఎంతో బాగుంటాయి!'' అనేసింది.

రిక్షాలో తన నివాసానికి పిల్లలిద్దరితో పయనం సాగిస్తోంది. గతుకులబాటలో రిక్షా కదలిపోతోంది. ఇంక తను పయనించేది గతుకుల బాటయే! అయినా తన బిడ్డలకు మాత్రం తను బంగారు బాట ఏర్పరచాలి! ఎంత శ్రమించైనా ఏర్పరచ గలుగుతుంది కూడా ! అనుకుంది శారదాదేవి.




# కంచే చేను మేస్తే

## "రాధ"

డాక్టర్ ప్రతాప్ మధ్యవయస్కుడే అయినా చూడటానికి చాలా పెద్దగా కనిపిస్తాడు. విజ్ఞానం, అనుభవం ఆయన్ని సంఘంలో చాలా వున్నతస్థితికి తీసుకు వెళ్ళిన మాట నిజమే కాని వయసులో కూడా వూహించ నంత మార్పు తీసుకురావటం ఆయనకి అసలు యిష్టంలేదు. ఎంత పెద్ద వైద్య వేత్త అయినా ఆ విషయంలో ఆయన చేయ గల్గింది మాత్రం ఏమీ లేకపోయింది.

డాక్టర్ ప్రతాప్ ప్రస్తుతం మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్. అంతే కాదు దేశంలో వున్నదగ్గ నిపుణుల్లో ఎన్నుకోదగ్గ వాడు కూడా. అమెరికా, యింగ్లాండ్ దేశాలలో పది సంవత్సరాలు పైగా వున్నతానుభవం గడించి ఎన్నెన్నో రీసెర్చ్ పేపర్లు రాసి అక్కడ కూడా చెరగని అక్షరాల్లో పేరు నిలుపుకుని వచ్చాడు. అందుకే ముఖ్యమంత్రి గారు ఆయన్ని వైద్యవేత్తగా నియమించు కున్నారు.

డాక్టర్ ప్రతాప్ స్వతహాసిద్ధంగా మంచి మనిషి అని చెప్పవచ్చు. మధ్యతరగతి కుటుంబంలోంచి పైకి వచ్చిన మాట నిజమే అయినా, యిప్పుడు ఆ రూపురేఖలు ఆయనలో అంతగా కనిపించక పోయినా, మనసులో ఎక్కడో మారుమూలల్లో ఆయనకి గతం గుర్తు వుండక పోలేదు. అందుకే బీదల పాలిట దేముడు అయ్యాడు. ధర్మాసుపత్రిలో అంతగా డబ్బుకి ఆశపడ కుండా నీతిగా న్యాయంగా వైద్యం చేసే డాక్టర్లలో ఆయన ఒకరు అని పేర్కొన వచ్చు.

డాక్టర్ ప్రతాప్ మొదటి భార్యని విడాకులు యిచ్చి వదిలేశారు, అమెరికాలో అడుగు పెట్టిన రెండు సంవత్సరాలకే.

న్యూయార్క్ మెతాడిస్ట్ హాస్పిటల్‌లో ఆయన రెసిడెన్సీ చేస్తున్న కాలంలో నర్స్ లిండా పామర్‌తో పరిచయం అయ్యింది ఆయనకి. అది ప్రణయంగా మారి మొదటి భార్య నాగరత్నమ్మగారి పాలిట ప్రళయంగా మారటానికి ఆరునెలలు పట్టలేదు.

ఆవిడ పౌరుషంగల మనిషి. పుట్టిన వంశం కూడా అలాంటిదే. అవమానానికి తల వంచే రకంకాదు తల్లిదండ్రులు, అన్నదమ్ములు. అందుకే తిరుగు టిక్కెట్టు కొని పంపించి మరీ తీసుకు తెచ్చుకున్నారు నాగరత్నమ్మని రెండేళ్ళ పిల్లవాడితో సహా.

లిండాతో పరిణయం అయ్యాక పెట్టిన కొత్త సంసారం కావలసినన్ని ఆనందాలు తెచ్చిపెట్టింది డాక్టర్ ప్రతాప్‌కి కొత్తల్లో. కొంతకాలానికి అది అలవాటుగా, మరికొంత కాలానికి 'ఎప్పుడూ వున్నదేగా' అన్నంతగా మారింది ముఖ్యంగా లిండా ప్రతాప్‌కి. కాని డాక్టర్ ప్రతాప్ ఏమీ చేయలేక పోయారు లిండా మీద ఏర్పడ్డ మోజుతో.

ఆంధ్రుల ఆడపడుచు నాగరత్నమ్మని వదిలించుకున్నంత తేలికగా అమెరికా ఆడపడుచు లిండాని వదిలించుకోటం అంత తేలికైన పని కాదని ఆయనకి బాగా తెలుసు.

అందుకే లిండా ఆయన పక్క శాశ్వతంగా చోటు చేసుకోగల్గింది, ప్రతాప్‌గారి మనసులో ఏలాంటి ఆలోచనలు వున్నా.

నాలుగైదు సంవత్సరాలు చాలా చలాకీగా గడిచిపోయాయి. లిండాకి కూడా

# కంచే చేనుమేస్తే

జీవితంలో ఏమీ లోటు కనిపించలేదు అంత వరకూ.

ప్రతాప్‌గారి పదవి మూలంగా, పలుకుబడి మూలంగా చాలా బిజీ మనిషి అయిపోయారు ఆ నాలుగయిదు సంవత్సరాలలోకే. ఇప్పుడు ఆయనకి లిండాతో మనసారా ఓ మాట మాటాడటానికి కూడా తీరిక దొరకటం లేదు. లిండాకి చిన్ననాటి నుండీ అమెరికాలో అది కొత్త కాకపోయినా ఆంధ్రావనిలో అడుగు పెట్టిన కొంత కాలానికి ఆవిడ ఊహల్ని కెలికినట్టయ్యింది ఆ పద్ధతి. ఆవిడకి అప్పుడే జీవితంమీద కొత్త మోజు పుట్టి వుండవచ్చు.

చాలామంది తెల్లవాళ్ళ జీవితంలో మొదట నేర్చుకునేది జీవితం అనుభవించడం ఎలా అన్నది. లిండా రక్తంలో కూడా అదే సిద్ధాంతం ప్రవహిస్తోంది అనాదిగా కొన్ని తరాల నుంచి వస్తూ. కొన్నాళ్ళ ఆ వుడుకు రక్తం మారిన నాగరికతలోపడి చల్లబడ్డా ఎదురీదటం మానలేదు ఇప్పుడూ.

తన మోజులు, కోరికలు అణచుకోవాలని విశ్వప్రయత్నం చేసింది లిండా. ఎన్నెన్నో క్లబ్బులకి సభ్యురాలయ్యింది. ఎన్నో ఛారిటీ సంఘాలకి ఛైర్మన్ అయ్యింది. లేడీస్ కల్చరల్ ఆర్గనైజేషన్‌కి అధ్యక్షురాలయ్యింది. గోల్ఫ్ నుంచి బిలియర్డ్స్ వరకూ ఆటలు కల్పించుకుంది. అపురూపమైన తన అమెరికా సౌందర్యం రవ్వంతైనా కరగకుండా దాచుకోవాలన్న తపనతో ప్రతీ వుదయం రకరకాల వ్యాయామాలు చేయటానికి ప్రత్యేకమైన స్లిమ్మింగ్ స్కూల్‌కి వెళ్ళేది. పురాతనంగా వస్తున్న ఆసనాల నుంచి పాశ్చాత్య దేశాలు ఆరితేర్చిన ఎక్సర్‌సైజ్‌లు వరకూ అన్నీ చేస్తుండేది క్రమం తప్పకుండా.

అయినా జీవితంలో తీరని లోటు ఆమె ఎదలో మబ్బుచాటు సూర్యుడిలా తెలిసీతెలియకుండా తికమక పెడుతూనే వుంది. ఏదో ఒక రోజు ఆ వేడి బయటకి రాకపోదు, కళ్ళకి కనిపించకపోదు. వంటికి తగలకపోదు అని ఎదురుచూస్తోంది లిండా ఆశగా.

ప్రతాప్‌గారు ఆ మాత్రం కనిపెట్టలేని అమాయకులు కాదు. ఎంత విజ్ఞాన వేత్త అయినా బుర్రలో ఎక్కిన వేడికి కళ్ళు బరువెక్కి దళసరయిన అద్దాలు ధరించుకునేటటు చేసినా ఆయనలో దూరదృష్టి రవ్వంతయినా తగ్గలేదు.

లిండాలో కనిపిస్తున్న మార్పు ఆయనలో ఒకరకమైన అసూయ, అసహనం పుట్టించాయి. కాని ఆయన చేయగలిగింది ఏమీ లేకపోయింది.

"లిండా డార్లింగ్ ఆర్ యు నాట్ హేపీ" అన్ని ఎన్నోసార్లు ఆప్యాయంగా అడిగారు ప్రతాప్.

"డోంట్ [illegible] సిల్లీ హనీ... వై షుడ్ ఐ" అని తన అందమైన నవ్వుల్లో రవ్వలు కెంపులు తెంపి విసిరేసి తప్పించుకుందే కాని కాస్తంతైనా తొణకలేదు లిండా.

ఆమెకి యింకా ఏదో కల్పించాలనీ, అందించాలనీ తాపత్రయ పడ్డారేకాని ఆమె మనసు వాంఛిస్తున్నది ఏమిటో కనిపెట్టలేకపోయారు డాక్టర్ ప్రతాప్.

మరికొన్ని మాసాలకి లిండా యింటి పట్టున వుండటం పూర్తిగా తగ్గించుకుంది. వుదయం ఏడు గంటలకి తన అందమైన కేడిలాక్ కారులో బయలుదేరి వెళ్ళి అర్ధరాత్రి సమయంలో యింటికి చేరుకోవటం అలవాటు చేసుకుంది.

"గో టు బెడ్ డార్లింగ్... అయామ్ టూ టైర్డ్" అనేది గోముగా, ప్రతాప్‌గారు కళ్ళు నులుపుకుని భార్యామణిని పలకరించబోతుంటే.

"నాకేమీ నచ్చలేదు నీ పద్ధతి" అని గట్టిగా అడగాలని అనుకున్నారు ఎన్నోసార్లు. కాని లిండా చిరునవ్వు నవ్వితే అడగాల్సింది ఏదైనా యిట్టే మర్చిపోతారు ప్రతాప్. అమెరికన్ నారీమణి నవ్వు అంత నిపుణమైనది మరి.

### "హేళన"

హీనమైన
నేటి
నాగరికతను
చూసి —
పక పక మని
నవ్వుతోంది
గరికపువ్వు !

— కోలపల్లి ఈశ్వరరావు








ఆఖరికి ఆయన ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ నిరయానికి రావటానికి చాలా కాలం పటినా యింకో దారి లేక తప్పనిసరి అయ్యింది ఆ పని.

లిండా నుంచి తను ఏదో పొందలేక పోవటం అలా వుంచి, తన నుంచి లిండా అంతవరకూ ఏం పొగొట్టుకుందో తెలుసుకోటం ధర్మం అనిపించింది ప్రతాప్‌గారికి.

"రాజా... ఈ విషయం నీకూ నాకూ తప్పించి యింకెవ్వరికీ తెలీకూడదు ... మీ మావగారి పరువు మర్యాదలు నీ చేతుల్లో పెడుతున్నాడు...ఏం చేస్తావో" అంటూ తన బాధంతా చేతిలో పెట్టి షేక్ హేండ్ యిచ్చారు రాజశేఖర్‌కి.

"నువ్వేమీ వర్రీ అవ్వకు మావయ్యా...నేను అంతా తెలుసుకుంటానుగా" అన్నాడు రాజ చిరునవ్వుతో నముదాయిస్తూ.

"ఎప్పటికప్పుడు ప్రోగ్రెస్ తెలియాలి నాకు"

"రోజూ నీకు ఫోన్ చేస్తాను పోనీ..."

"ఫోన్ చేయొద్దు ... యింటో అనుమానం రావచ్చు.. నేనే నిన్ను కాంటేక్ట్ చేసుంటాను ఎప్పుడో ఒకప్పుడు ... ముందు నువ్వు పని ప్రారంభించు. వీలయితే రేపటి నుంచే"

"అలాగే మావయ్యా..."

ప్రతాప్ గారి మనసు తేలిక పడింది.

*         *         *

ఉదయం ఏడుగంటలకే ఎదురయ్యాడు రాజశేఖర్.

"హలో, ఆంటీ గుడ్‌మార్నింగ్" అన్నాడు లిండాని పలకరిస్తూ.

'హలో, రాజా...హౌడుయుడు ... నైస్ మార్నింగ్ ఈజ్‌యిన్‌టిట్" — అంటూ కేడలాక్ కారు ఎక్కి తేలికగా డ్రైవ్ చేసుకుంటూ వెళ్లిపోయింది.

రాజేష్ స్కూటర్ స్టార్ట్ చేశాడు ఉషారుగా.

తొమ్మిది గంటల ప్రాంతంలో స్విమ్మింగ్ పూల్‌లోంచి బయటకు వచ్చి బృందావన్ హోటల్‌కి బయలుదేరింది లిండా.

రాజా వెంబడించాడు గుట్టుగా.

ఆంధ్ర బ్రేక్‌ఫాస్ట్ అమెరికన్ పద్ధతిలో భుజించి బయటకు నడిచింది లిండా.

చూసిచూసి విసిగిపోయిన రాజా లోపలికి వెళబోతూ ఆమె కంట పడ్డాడు.

"వాట్ ఎ సర్‌ప్రయిజ్...హేవెన్‌ట్ యు టేకెన్ యువర్ బ్రేక్‌ఫాస్ట్ యెట్ ..." అంది లిండా తమాషాగా కళ్ళు త్రిప్పుతూ.

తనకోసం నిలబడకుండా కారు వైపు వెళ్తున్న లిండాని అనుసరిస్తూ "నో నో జస్ట్ ఫర్ కాఫీ" అన్నాడు కంగారుగా.

"అయ్ థాట్ యు ఆర్ ఫాలోయింగ్ మి" అంది గుట్టుగా నవ్వుతూ నన్ను వటించేవేమిటి ఈ రోజు అంటూ.

రాజా కించిత్తు దిగ్భ్రమ చెందాడు

"ఆ పని చేయడానికి ఎంత ధైర్యం వుండాలి నాకు" అన్నాడు ఉంగ్రంలో

"ఆంటీ విన్నొకటి అడగాలనుకుంటు న్నాను ఏమీ అనుకోవుకదూ" తిరిగి ప్రశ్నించాడు

"ముందు నన్ను ఒకటి చెప్పనిస్తావా" అంది లిండా.

"ష్యూర్... లేడీస్ ఫస్ట్—"

"నన్ను ఆంటీ ఆంటీ అని పదే పదే పిలవకు... ప్లీజ్ ఐ డోంట్ లైక్ యిట్" అంది మదురు చిట్లిస్తూ.

"అయాం సారీ... వరసకు అత్త వు అవుతావుకదా అని ఆంటీ అంటున్నానంతే... నీకు యిష్టం లేకపోతే పిలవనులే అలా..."

"నీకూ నాకూ వయసులో ఎంత తేడా వుంటుందో చెప్పు" లిండా అడిగింది.

"ఏమో నాకు తెలీదు..."

"ఆ మాత్రం ఊహించలేవా" చిలిపిగా నవ్వింది.

"నీ వయసు ఊహించడం కష్టమే నాకు" అమాయకత్వం చూపించాడు మాటల్లో.

"కమాన్ రాజా.. నువ్వు డాక్టర్‌వి... ఆ మాత్రం ఊహించలేవంటే నేను నమ్మను..."

"నీ వయసు ఎంత అయినా నువ్వు మాత్రం యింకా పెళ్ళికాని అమ్మాయిలాగే కనిపిస్తావు... అది మాత్రం నచ్చి నిజం.." అన్నాడు చిలిపిగా

లిండా కళ్ళలో వింతగా మెరిసింది రాజశేఖర్ రూపం అనుకోకుండా.

"నీకు ఇరవై ఆరేళ్ళు వుంటాయను కుంటాను" లిండా అడిగింది

"యు ఆర్ రైట్... అక్షరాలా నా వయసు అదే... ఎలా కనిపెట్టావు?"

"ఆ వయసు రాకుండా నువ్వు యింత డాక్టర్‌వి ఎలా అవుతావులే" అంది తేలికగా తీసిపారేస్తూ.

"అయితే నీకూ అదే వయసు వుంటుందా"

"నీకు అంత చిన్నగా కనిపిస్తున్నానా ఏమిటి... మై గుడ్‌నెస్" అంది ఫక్కున నవ్వుతూ.

"మీ అమెరికన్స్ అందరూ ఎంత వయసు వచ్చినా యింత అందంగానే వుంటారు అనుకుంటాము..."

"అందరూ కాదు కాస్త కట్టుబాటులో ఉన్నవాళ్ళు మాత్రమే..."

"ఏమిటో ఆ కట్టుబాట్లు..."



## కంచే చేనుమేస్తే

"చిల్లర తిళ్ళు... తిరుగుళ్ళు మామ కోటం..."

"అయ్ సీ..."

"కమాన్ రాజా... నీకు ఆ మాత్రం తెలీదా ఏమిటి."

"ఇది జనరల్ నాలెడ్జ్ కాని మెడికల్ నాలెడ్జ్ కాదుగా కాలేజీలో నేర్చుకోటానికి"

"అమెరికాలో దీన్నే కామన్ సెన్స్ అంటాం మేము" ఏత్తిపొడిచింది.

"అలాగా"

"యింతకీ నీ ప్రయాణం ఎక్కడికి"

"ఎక్కడికి అని ఏమీ అనుకోలేదు."

"అయితే యింకే...నాతోరా"

ఎక్కడికి అని అడగకుండా కారు ఎక్కాడు స్కూటర్ తాళాలు చటుక్కున ఫాంట్ జేబులో తోస్తూ.

"యింతకీ నా వయసు ఎంతో వూహిం చావా" కారు స్టార్ట్ చేస్తూ అడిగింది లిండా.

"బహుశా నా కంటే రెండు మూడు ఏళ్ళు పెద్దయివుంటావు అంతేనా..."

"ఫర్వాలేదే" రాజా వైపు ఒకసారి ముద్దుగా చూసి చూపులు త్రిప్పుకుంది.

"అందుకే నువ్వు నన్ను ఆంటీ అని పిలుస్తుంటే భరించలేక పోతున్నాను ... నీ కంటే ఏమంత పెద్దదాన్ని కాదుగా ! లిండా అని పిలు బాగుంటుంది."

"దటీజ్ ఫైన్" ఏమనాలో తెలియక ముఖమాట పడ్డాడు రాజశేఖర్.

"యిప్పుడు చెప్పు నీ ప్లాన్ ఏమిటో" అంది లిండా వున్నట్లుండి.

"ప్లానా...నువ్వు ఏంమాట్లాడుతున్నావో నాకు అర్థం కాలేదు"కంగారుపడ్డాడు రాజు.

"వాట్ ఎ జెంటిల్ మేన్..." ఫక్కున నవ్వి కారు ప్రక్కగా ఆపింది.

"పొద్దుట నుంచి నువ్వు ఫాలో అవ్వటం నేను చూడలేదు అనుకోకు ... చూశావా ఈ కారు నిండా అమెరికన్ అద్దాలు ఉన్ని వున్నాయో—వెనుక ముందు ఎవరు వెళ్తుంది ఎవరు వస్తోంది అన్నీ కనిపిస్తాయి ... యిప్పుడు అర్థం అయ్యిందనుకుంటాను."

రాజశేఖర్ తల వాల్చేశాడు ఓటమి అంగీకరిస్తూ.

* * *

ప్రతాప్ గారు కబురు పంపించారు రాజశేఖర్‌ని వెంటనే కలుసుకోమని.

"ఏమిటి మామయ్యా, నాతో ఏదో అర్జెంటుగా మాట్లాడాలన్నారట" అన్నాడు ముభావంగా

"నేను అప్పగించిన పని మర్చిపోయావా ఏమిటి ... ఏమీ తెలియనట్టు మాట్లాడుతున్నావు" చిరుకోపం ప్రదర్శించారు ప్రతాప్.

"ఓ అదా...అద్బే అదెలా మర్చిపోతాను"

"అయితే ఎంతవరకూ వచ్చింది."

"ఏది యిప్పుడేకదా ప్రారంభించాను."

"యిప్పుడేంటి, నీకు చెప్పి వారంరోజులు అయ్యిందే."

"అయినా నాకు కాస్త టైము పడుతుంది కదా అలవాటు పడటానికి."

"వారంరోజులు ఎక్కువే అనుకుంటాను, అసలు ఏమైనా తెలుసుకున్నావా... అసగసగా దగ్గరే ఆగిందా కథ" అసహనంగా ప్రశ్నించారు ప్రతాప్.

"నువ్వేమీ వర్రీ అవ్వకు. యిప్పటివరకూ అంతా బాగానేవుంది"

"ఏం బాగుందో ఏమిటో అంతా నీకే తెలియాలి. నా మీద గౌరవం వుంచి కాస్త జాగ్రత్తగా చూడు."

"నీకాభయం అక్కర్లేదు. అన్నీ నేను చూస్తాను. నువ్వు రిలాక్స్ అవ్వు" అన్నాడు రాజు గర్వంగా ఛాతీ బిగిస్తూ.

"నాకు నమ్మకం వుంది నువ్వు సాధిస్తావని..." మేనల్లుడి భుజం తట్టి పంపించారు ప్రతాప్. ఆయన మనసు మాత్రం యింకా కుదుటపడలేదు. ఏదో బలమైన చేయి భుజం తట్టకపోగా గొంతుక బిగిస్తున్నట్లనిపించింది ఆయనకి.

*  *  *

ఆ రోజు ఆదివారం. పదిగంటలకి అన్న ప్రకారం బృందావన్ హోటల్‌లో కలుసుకున్నారు రాజు, లిండా.

"హల్లో యు లుక్ స్మార్ట్ టుడే" అంది రాజశేఖర్‌ని పలకరిస్తూ.

"థాంక్యూ... యుటూ..." కళ్లల్లోకి సూటిగా చూస్తూ విసిరాడు మాట.

"బయలుదేరదామా – ఏమైనా అభిస్యం వుందా" అంది లిండా మునిపంటితో పెదవి పిండుతూ.

"నో...వాట్ విట్ ఆల్"కారు విక్కాడు రాజు.

"ఏమిటి ఈ రోజు ప్రోగామ్" డ్రైవ్ చేస్తూ అడిగింది లిండా.

"నాకు ప్రత్యేకంగా ఏమీ లేదు"

"నన్ను ఫాలో అవ్వటం తప్పించి"ఫక్కున నవ్వింది.

రాజు ప్రతి కలిపాడు ఏం చెయ్యాలో తెలియక

"ఎంతవరకూ వచ్చింది నీ కథ"

"ఏ కథ"

"నీకు మీ మావయ్య ప్రత్యేకంగా అప్పగించిన అసైన్‌మెంట్ కథ"

"అదా దాన్ని ఆ రోజే వదులుకున్నాను"

"ఏంఎందుకట పాపం"

"మామయ్యకి బుద్ధి లేకపోతే నాకు కూడా లేదనుకున్నావా ఏమిటి."

"వంశమంతా ఒకటేగా" ఎత్తిపొడిచింది లిండా.

"వంశం ఒకటే అయినా మనుషులు రకరకాలుగా వుంటారను కుంటాను ఏ దేశంలో అయినా" చురుకుగా చూసింది.

"మీ మావయ్య మాట అంటే నీకు చాలా గౌరవం అనుకుంటాను."

"నీతో బాగా పరిచయం అయ్యాక తెలిసింది మరి మావయ్య ఎంత మూర్ఖుడో"

"పొరపాటు... మీ మావయ్య మూర్ఖుడు కాదు... జీనియస్... ప్రపంచమంతా సెల్యూట్ చేసేటంత గొప్ప వైద్య నిపుణుడు..."

"కావచ్చు కాని నీ విషయంలో చాలా మూర్ఖంగా ఆలోచిస్తున్నాడు... ఆ విషయంలో అతని విజ్ఞానమంతా బూడిద పోసిన పన్నీరే..."

"అయితే నా గురించి నీ అభిప్రాయం."

"నువ్వు కేవలం అమెరికన్ యువతివే కాదు... మనసు పంచుకోదగ్గ నారీమణివి."

"చాలా పెద్ద పొగడ్త అనుకుంటాను... నాకు నప్పుతుందంటావా..."

చిలిపిగా నవ్వింది.

"ఎందుకు నప్పదు? నీలో ఏ లోపం లేదు. నిజం చెప్పాలంటే నీ అంత ప్రత్యేకమైన స్త్రీని నేను యింత వరకూ చూడలేదు."

"మీ అమ్మగారి కంటేనా..."

తెప్పరిల్లటానికి కొన్ని క్షణాలు పట్టింది రాజశేఖర్‌కి.

"మీ ఆడవాళ్ళలా మనసు కట్టిపారేసుకోటం చేతకాదు మాకు. ఎదురుగా తేనె వుంటే వాసన చూడటం పిచ్చితనం. దాన్ని జుర్రుకోవాలి అదే మేము చిన్నప్పటి నుంచి నేర్చుకుంది మరి. అందులో ఏమీ తప్పు లేదనుకుంటాను"

"పోనీ నువ్వు ఎప్పుడైనా ప్రయత్నించావా."

"ఏమిటి."

"తేనె"

రాజశేఖర్‌కి బుర్ర తిరిగింది మాటలు అర్థం చేసుకునేసరికి.

కిర్యాయ్ గార్డెన్‌లోకి నడిచారు ఇద్దరూ. నిశ్శబ్దంగా నిర్మలంగా వుంది శీతాకాలపు సాయం సమయం.



# వారఫలం

## 30 4 1982 శుక్రవారం మొదలు 6 -5-1982 గురువారం వరకు

★ మేషం:— మీకు ధన ధాన్య వస్త్ర వాహన సేకరణకు అనుకూలవారం. కొందరు గృహసంబంధమైన కార్యములందు నిమగ్నులు కాగలరు. రాజకీయంగా ఆశించిన ఫలితం' అందగలదు. స్త్రీలకు నూతన విషయ సేకరణకు, ధనలబ్ధికి అవకాశం గలవారం.

★ వృషభం: దూరబంధువుల నుండి, మీరు ఆశించని విషయములందగలవు. కొందరికు శుభకార్య ప్రస్తావనలుండును. కొందరు, తమ ఉద్యోగమందు 'ప్రమోషన్' ఆశించవచ్చును. స్త్రీలకు కుటుంబానందం, ఉద్యోగంలో పై అంతస్తుకు పోయే మార్గముండును.

★ మిధునం — ధన దయం, సంఘ గౌరవం, క్రీడ రంగంలో కొందరకు అవకాశాలుండును. రాజకీయంగా కొందరకు సదవకాశాలుండును. స్త్రీలకు సుఖ శాంతులు, గృహానందం, సభా గౌరవం గలవారం. ఆరోగ్యలోపం కూడా ఏర్పడగల వారం.

★ కర్కాటకం: అనుకున్నవిధంగా స్వకార్యములు నెరవేరగలవు. అప్రయత్నంగా ఆదాయం రానున్నది. చాలమందికి ఉద్యోగములందవకాశం లభించు మార్గమున్నది. రాజకీయవాదులకు మేలు గలవారం స్త్రీలకు : కళాసాహిత్యరంగావకాశముండును. ధన లబ్ధికి అవకాశం గలవారం.

★ సింహం ధనాదయం గలవారం. అధికారుల వలన జరిగే పనులు సుకరంగా నెరవేరగలవు. దేవాదాయ ధర్మాదాయాలలో పనిచేసే వారికి సుఖంగా కొన్ని పనులు జరుగగలవు. స్త్రీలకు ధనలబ్ధికి, ఉన్నతోద్యోగావకాశాలకు అవకాశం గలవారం.

★ కన్య చాల పనులు మిత్ర సహాయంవలన నెరవేరే అవకాశముంటుంది. కొంచెమో గొప్పగానో ధన లబ్ధి గలవారమే. రాజకీయ రంగానుభవం గలవారికి క్రీడవనిలో ప్రవేశమున్నవారికి సదవకాశాలు లభించగల వనుటలో సందేహంలేదు. స్త్రీలకు ఉద్యోగంలో మంచి అవకాశాలు ఏర్పడే మార్గం, కించిత్తు ఆదాయం గలవారం.

★ తుల : ఎలా చూచినా పెద్దగా తృప్తి జరుగని వారమే. ఏ కోణంనుండిచూచినా ధన దాయం చెప్ప వీలులేదు. ఏ పరిస్థితులలో కూడ మీకు మేలు జరుగుతుంది అని అనుకోరాదు. స్త్రీలకు ధన లబ్ధి కార్యానుకూలత చెప్ప వీలులేనివారం. ఆరోగ్య లోపం లేనివారం అని కూడ గ్రహించాలి.

★ వృశ్చికం — శుభ కార్య ప్రస్తావనలుండగలవు. బంధువుల నుండి మేలైన వార్తలు అందనున్నవి. ఆప్త మిత్ర సహాయం, ఆదరణ అనుకూలత, అధికారుల వలన జరుగవలసినపనులు సుకరంగానెరవేర గలవారం. స్త్రీలకు ఒకానొక విషయంలో మీకు అపకారం జరిగే వారంగా గ్రహించాలి.

★ ధనుస్సు — ధనలబ్ధికిఅవకాశం, క్రయవిక్రయ లాభం, కొందరు నూతనవ్యాపారం ప్రారంభించే మార్గాన్ని చేపట్టటం, క్రీడావనిలో కొందరిక్ష పెప్పుకోదగ్గ అవకాశాలుండగలవు. స్త్రీలకు — అధికారుల మూలాన జరుగవలసిన అనుకూలత పోయే మార్గం ద్యోతకం.

★ మకరం — మీకు కార్య విజయం, ముఖ్యంగా వైద్యవృత్తి, న్యాయవాదవృత్తి ప్రకాశించగల అనుకూలతగలదు. కథకులకు, వ్యవహార దక్షతగలవారికి మంచి వారమే. రచన విధానంలో కొందరు బాగా పుంజుకొంటారు. స్త్రీలకు సుఖం, ఆనందం, సంతాన మూలక సంతోషం కలుగుట గమనిస్తారు.

★ కుంభం — ఇంకా మంచి రోజులు రాలేదని ఆవేదన పడకండి. క్రమంగా దినదినాభివృద్ధి, ఉద్యోగ వృత్తులందు సమకూడే అవకాశం గలవారం. చాల కాలంగా రావలసిన ధనం చేతికందగలవారంగా గ్రహించాలి. స్త్రీలకు సర్వ విధాలా మేలు చేకూర గలవారం.

★ మీనం — వారమంతా సుకరంగా, ఆనంద దాయకంగా, ధనలబ్ధితో హాయిగా సాగిపోయేవారం రాజకీయంగాచాల మందికిఅనుకూలత చెప్పవచ్చు. స్త్రీలకు అవసరాలకు సరిపోయే ధనం, అధికారుల వలన సంతోషం సంభవం.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి*

## కంచే చేనుమేస్తే

"మీ మామయ్యకూ నాకూ పదిహేను సంవత్సరాల తేడా వుంటుంది మరి వయసులో" అంది లిండా.

"పెళ్ళికి ముందు ఆలోచించలేదా మరి."

చివాలున తలఎత్తి చూసింది లిండా. కాని కోపంలేదు ఆ చూపుల్లో.

"అమెరికాలో నన్ను కలుసుకున్నప్పుడు మీ మామయ్య సిలా స్మార్ట్‌గా వుండేవాడు. అఫ్‌కోర్స్ చాలా నెమ్మదిగా వుండేవాడు అనుకో."

"ఆకర్షణలో పడ్డానన్నమాట."

"ఆకర్షణ మీ వంశంలో కూడా వుందను కుంటాను"

రాజశేఖర్‌కి ఏం చెప్పాలో తోచలేదు

"ఇంత వరకూ వచ్చి పట్టే చేతులతో వెళ్ళటం దేనికి? తేనె ఎలా వుంటుందో రుచి చూసే వెళ్ళు. చెప్తే మీ మామయ్య నంతో పిస్తాడు."

నెమ్మదిగా అతని శిరస్సు రెండుచేతుల్లోకి తీసుకుని అతని పెదవుల్ని చుంబించింది సినిమాలోలా. రాజశేఖర్ ఉక్కిరి బిక్కిరి అయ్యాడు.

* * *

మర్నాడు ప్రతాప్‌గారి దగ్గరనుంచి ఫోను వస్తే కంగారు పడ్డాడు రాజశేఖర్.

"థాంక్స్‌రా రాజా. నిన్న రాత్రి నువ్వు దగ్గర లేకపోతే లిండా చాలా ట్రబుల్ పడి వుండేది పాపం. కారు పంచర్ అయ్యిందట కదా?."

"ఓ అదా. దానికేముంది మామయ్యా ఒకరికొకరు ఆ మాత్రం సహాయం చేసుకోకపోతే ఎలా చెప్పు" అన్నాడు తేలికగా వూపిరి తీస్తూ.

"దటీజ్ గుడ్, నేను చెప్పిన పనిమాత్రం మర్చిపోకు. నీ కార్యక్రమం బాగా జరుగుతుంది అనుకుంటాను."

"ఓ దాని గురించి నువ్వు ఏమీ వర్రీ అవ్వద్దు. నువ్వు యిక ప్రశాంతంగా వుండొచ్చు, అత్త చాలా మంచిదిమావయ్యా" అన్నాడు నీళ్లు నములుతూ.

"థేంక్స్‌రా రాజా నా పరువు నిల బెట్టావు."

ఫోన్ పెట్టేశారు ప్రతాప్‌గారు వున్నట్టుండి.

ప్రక్క గదిలోంచి ముస్తాబవుతూ అంతా విన్న లిండా తృప్తిగా నిట్టూర్చింది తను ఏన్నాళ్ళనుంచో వెదుకుతోంది అది అని తెలిసినందుకు?

# ఉత్తరదేశపు వంటలు వంటకాలు



## మేథి పరోతా

గోధుమపిండి - 100 గ్రా, శెనగ పిండి - 50 గ్రా, మెంతికూర - 50 గ్రాములు, ధనియాల పొడి - ఒకటిన్నర స్పూను, జీలకర్రపొడి - 1 టీ స్పూను, కారం - 1 టీ స్పూను, ఉప్పు, పసుపు తగినంత, కొత్తిమీర - 15 గ్రాములు, నూనె తగినంత.

మెంతికూర, కొత్తిమీర సన్నగా తరిగి, కడిగి ... స్పూను నూనెతో నీళ్ళు ఇగిరిపోయే వేయించాలి తరువాత గోధుమపిండి, పిండి పై మసాలా, మెంతికూర వేసి ... పిండిలా కలుపుకోవాలి ఈ ... రొట్టెలలాగా వత్తుకొని, దానిమీద నెవాచి మడత పెట్టి రొట్టెల లాగా వత్తి ... వైపులా నూనె రాసి పెనముమీద కాల్చుకోవాలి.

## మూలీ పరోతా

ముల్లంగి దుంపలు - 3 గోధుమ పిండి - అరకిలో, పచ్చిమిరపకాయలు -5, ...పాలు, ఉప్పు, పసుపు - తగినంత, కొత్తిమీర కొంచెం.

ముల్లంగిదుంపలు కడిగి, సన్నగా తురిమి, ఉప్పువేసి పది నిముషాలు వుంచాలి. కోరు నీళ్ళన్నీ పిండి కోరు వేరుగా వుంచుకోవాలి. పచ్చిమిరపకాయలు, కొత్తిమీర సన్నగా తరిగి మూకుడులో టేబుల్ స్పూను నూనెవేసి ...వాలు వేసి అవి చిటపటలాడాక పచ్చిమిరపకాయలు, ముల్లంగి కోరు, ఉప్పు, పసుపువేసి పది నిముషాలు వేయించి పిండితో కలుపుకోవాలి పిండిని పైన చెప్పిన విధంగా వత్తుకొని నూనెతో కాల్చుకోవాలి.

## ఆలు పరోతా

గోధుమపిండి 100 గ్రాములు, బంగాళా దుంపలు - 100 గ్రాములు, ధనియాల పొడి - 1 టీ స్పూను, జీలకర్ర పొడి - 1 టీ స్పూను, అల్లం (సన్నగా తరిగి) - ... గ్రాములు. పచ్చిమిరపకాయలు (సన్నగా తరిగి) - 4, ఉప్పు, నూనె - తగినంత.

ఆలు వుడికించి, పొట్టుతీసి, వేడిమీదనే ముద్ద చేసుకొని వుంచుకోవాలి. గోధుమ పిండి, ఆలు, మసాలాలు అన్నీ కలిపి పై విధంగా పరోటాలు వత్తుకొని కాల్చుకోవాలి.

## ఖైమా పరోతా

మాంసం ఖైమా - పావుకిలో గోధుమ పిండి - అరకప్పు, మైదాపిండి - 1 కప్పు, వుల్లిపాయలు - 2, అల్లం, వెల్లుల్లి - కొద్దిగా, పచ్చిమిరపకాయలు - 6, పసుపు - పావు టీ స్పూను, వుప్పు, నూనె - తగినంత. ధనియాలు, జీలకర్ర, లవంగాలు, దాసించెక్క - కొద్ది కొద్దిగా.

ధనియాలు, జీలకర్ర, లవంగాలు, దాసించెక్క పొడి కొట్టాలి ఉల్లిపాయలు సన్నగా తరగాలి. అల్లం, వెల్లుల్లి నూరుకోవాలి. నూనెలో వుల్లిపాయలు వేయించి ఖైమా, అల్లం, వెల్లుల్లి మిగిలిన మసాలా వేసి మాంసం మెత్తబడేవరకూ వుడకనివ్వాలి. దింపి గరమ్ మసాలా వేసి, మైదాపిండి, గోధుమపిండిలతో కలిపి పై విధంగా పరోటాలు వత్తుకొని కాల్చుకోవాలి

- మాధురి అమ్రిత

## మటర్ సబ్జి

కావలసిన వస్తువులు: పచ్చి మటర్ గింజలు - 1 పావు కిలో, పెద్ద ఉల్లిపాయలు - 2, అల్లం - 1 చిన్న ముక్క, పచ్చిమిర్చి - 4, వెల్లుల్లి రేకులు - 2, జీలకర్ర - అర టీ స్పూను.

చేయువిధము: ముందు మటర్‌లో కొద్దిగా నీరుపోసి వుడక పెట్టాలి. వుల్లిపాయి సన్నగా చెక్కుగా తరుక్కోవాలి అల్లం, మిర్చి, వెల్లుల్లి, జీలకర్ర మెత్తగా నూరుకోవాలి. బాణలిలో తగినంత రిఫైండ్ ఆయిల్ వేసి నూరిన ముద్ద, వుల్లి చెక్కు సన్నటి సెగమీద ఎర్రగా వేయించాలి. వేగిన తరువాత వుడికిన మటర్, వుప్పు, పసుపు, అర గ్లాసు నీరు పోసి కలిపి మూత పెట్టాలి. నీరు ఇగిరిం తర్వాత వేరే గిన్నెలోకి తీసుకోవాలి. గరం మసాలా ఇష్టపడేవారు దింపే ముందు అర టీ స్పూను మసాలా పొడి వేసి దింపుకోవాలి. ఇది రొట్టెలకి, పూరీలలో బాగుంటుంది.

- ఎం. పి. రాణి



## ఉగాది సంచిక

నాటి పత్రిక ముఖచిత్రం ఉగాది వూహలు కడు రమ్యంగా ఉంది. స్త్రీల సమస్యలకు కారణం ఏమిటి? వ్యాసం ప్రతీ స్త్రీని ఆలోచింప చేసేదిగా ఉంది. తరచు ఇటు వంటి వ్యాసాలు ప్రచురిస్తూ ఉంటే పల్లె వాసులమైన మా స్త్రీలకు ఎంతో విజ్ఞాన దాయకమైన విషయాలు తెల్సుకోడానికి అవకాశం ఉంటుంది.

ఎం. పద్మావతి, ఎం. సాయి గణేష్, పి.వి వరలక్ష్మి (సంపర)

* * *

శంకుగారి కార్టూన్ ముఖచిత్రంతో వెలువడిన ఉగాది సంచిక మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. ముఖ్యంగా తెలుగు ప్రేమ, హాస్యకథ కడుపుబ్బ నవ్వించాయి. ఉగాది పచ్చళ్ళ కార్టూన్స్ బాగున్నాయి. మనసు కథ, తార సీరియల్ ఎంతో వుత్సాహాన్ని రేకెత్తించి మళ్ళీ మళ్ళీ చదివించేలా చేస్తున్నాయి. పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాము అంటే అతిశయోక్తి కాదు

ఎస్. చాంద్‌బాషా (పెదనపల్లి)

* * *

చూడ చక్కని కెంపు ఉగాది వూహలు. ముఖచిత్రం సొంపు. అబ్బా ఎంత బాగుందండీ కార్టూన్

# ఉత్తరాలు

## (4వ పేజీ తరువాయి)

ముఖ చిత్రం. చిత్రకారుడు శంకుగారికి, ప్రచురించిన మీకు శుభాభినందనలు. ఉగాది కార్టూన్స్ చదివి అందరం హాయిగా నవ్వుకున్నాం. ఉగాది పుట్టు పూర్వోత్తరగాథల. వసారుతిగారి ప్రత్యేక వ్యాసం వన్నె తెచ్చింది కథలలో తెలుగు ప్రేమ, హాస్యకథ చదువుతున్నంత సేపూ వచ్చేంత నవ్వొచ్చింది. హాస్య కథలో హాస్యంతోపాటు సందేశం, చివరలో విషాదం కూడ ఉన్నాయి. మనసు కథ సీరియల్ మహా సస్పెన్స్‌గా ఉంది. సుజాత మనస్తత్వం మరీ అయోమయంగా విచిత్రంగా ఉంది. ఏమైనా తుదివరకు ఎదరు చూపులు తప్పవు. తార చాలా బాగుంది. నాగరత్నమ్మ లాంటి స్వార్థపరులైన తల్లులు వాస్తవంలో కూడా వున్నారు.

మోటమర్రి బేబీకళ్యాణి (బెండమూర్లంక)

* * *

ఈవారం (2—4—82) ఉగాది సంచికగా వెలువడిన పత్రిక లో సర్వ రుచులు ఫలాస్వాదన చేయించింది. ముఖచిత్రం సూపర్బ్. హాస్యకథలు రెండూ తెలుగు ప్రేమ, హాస్యకథ చాలా బాగున్నాయి, చక్కటి స్టైలులో సాగాయి.

రామనగారి "చైతన్య పుష్పం" రేపటి తీయని ఆశలు, గుబాళింపులు విరిసాయి. 81—ఫిలిమ్ బాలెట్ విజే[త] పత్రికా ముఖంగా నా జేజేలు.

పెన్మెత్స సూరిబాబు (హైదరాబా[ద్])

* * *

ఉగాది కార్టూన్స్, వూహల ఉయ్యా[ల] 1981 ఫిలిం బాలెట్ ఫలితాలు, ఉ[గాది] పుట్టు పూర్వోత్తరాల గాథ వ్యాసము వి[లువై]న ఆనంద దాయకములైన అంశాల[తో] అత్యంత మనోజ్ఞంగా ఉన్న ఉగాది స[ంచిక] ఉజ్జ్వల తారాహారం.

ఆకెళ్ళ సుబ్బారావు (కందిక[ొండ])

* * *

ఈవారం ఉగాది ప్రత్యేక స[ంచిక] అందంగా అత్యంత ఆకర్షణీయంగా 'ఊహలు' ముఖ చిత్రం గీసిన శ్రీ శంకు[కు] మా అభినందనలు.

'తెలుగు ప్రేమ, హాస్యకథ'లోని [హా]స్యానికి మేము కడుపుబ్బ నవ్వుకున్నా[ం]. తార, మనసు కథ సీరియల్స్ రెం[డూ] అత్యంత ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్న[ాయి.] ముందు ముందు ఏం జరుగుతుం[దో] అని వచ్చే సంచికకోసం ఎదురు చూ[స్తు]న్నాం.

జి. శివశంకర్ రావ్ [గొల్లప్రో[లు]

* * *

ఉగాది సంచిక అట్టమీద శంకుగారి [ఉగాది] వూహలు బాగుంది. కొత్తమ్మలు కథ వూ[హల] ఉయ్యాల చిన్న పిల్లలకు అక్షరూపమైన [అ]లంకరణ. హాస్యకథ వస్తవానికి దగ్గరగా ఉంది.

ఎస్. ఇందుముఖి (హైదరాబా[ద్])

* * *

2—4—82 నాటి ఆంధ్ర సచిత్ర వా[ర] పత్రిక ఉగాది కార్టూన్ చిత్రం శం[కు] గారిది హృదురమ్యంగా, కడుహాస్యాన్ని అంద[ి]చింది. ఈ వారం కార్టూన్స్ అన్ని బా[గు]న్నాయి. ఉగాధి పుట్టు పూర్వోత్తరం గు[రించి] గురించి నిపులంగా ఈ పర్వదినంనాడు వ్రాయ[డం] ఎంతైనా ప్రశంసనీయం. వూహల ఉయ్యాల సీరియల్ కార్టూన్ కలర్‌లో ప్రచు[రిం]చాలి. ప్రతివారం కలర్ లో ప్రచు[రి]స్తే బాగా ఉంటుంది. తెలుగు ప్రేమ, హా[స్య] కథలు బాగున్నాయి. మనసు కథ సీరి[యల్] సస్పెన్స్‌తో సాగుతోంది. సుజాత [ప]ాత్ర చిత్రణ, ఆవిడ మనస్తత్వం, ఎ[ద] లోని భావపరంపర, ఆలోచనలు ఉత్సు[కత] కల్గిస్తున్నాయి. రచయిత్రి వాసిరెడ్డి సీతా[దేవి] గార్కి మా అభినందనలు.

వై. హేమసుందర్ రావు, హేమబిందు, ప్రస[ాద్] (డోర్నకల్)




**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Stree[t] Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**